# ఏకమూలికాప్రయోగరత్నావళి.

ఇది 9417

ఓ. వై. శ్రీ. దొరసామయ్యచే

రచియింపఁబడి,

చెన్నపురి:

కపాలీముద్రాక్షరశాలయందును

కలారత్నాకరముద్రాక్షరశాలయందును

ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.

1909.



# విషయసూచిక.

విషయము. — పుట.


పీఠిక ... ... ... ... 1
జ్ఞాపిక ... ... ... ... 4


## శరీరపోషణప్రకరణము.

### శరీరపోషణపద్ధతి.


గాలి ... ... ... ... 6
నీళ్లు, భోజనము, ఆహారవస్తువులు ... ... 7
నిద్ర, వాసస్థానము ... ... 8
వస్త్రములు, వృత్తి ... ... ... 9
మనస్సు, సంగము ... ... ... 10


## సంజ్ఞాప్రకరణము.


ఔషధసేవనప్రమాణము ... ... 12
ఔషధమానము ... ... ... 12


## రోగనివృత్తిక్రియలు.


పథ్యము, మంత్రము, ఔషధములు ... ... 14
త్రిదోషస్థానములు ... ... ... 15
త్రిదోషకాలము, నాడీకారణము ... ... 16
నాడీపరీక్షాస్థానములు, ఆరోగ్యనాడీగమనము, పురుషులవాతనాడి, స్త్రీలవాతనాడి, పురుషుల పిత్తనాడి, స్త్రీలపిత్తనాడి ... ... 17
పురుషులశ్లేష్మనాడి, స్త్రీలశ్లేష్మనాడి, నాడీనిర్ణయము 18


## షట్స్థానపరీక్ష.


రోగి శరీరస్థితి ... ... ... 19

నాసికాస్రావము ... ... ... 98
రక్తపీనసము ... ... ... 98
పూతినాసికా ... ... ... 98
పూతిరక్తనాసికా ... ... ... 98
స్వేదము, దుర్గంధస్వేదము, కలబందకంపు ... 99
స్థూలము, మేదోవృద్ధి ... ... ... 99
కృశము, క్షీణము, శుష్కము ... ... 99
దుర్బలము ... ... ... 99
ప్రసుప్తివాతము ... ... ... 100
గ్రంథి ... ... ... ... 100
అస్థిగ్రంథి, అస్థివ్రణము ... ... 100
వ్రణము, పుండ్లు ... ... ... 101
అగ్నివ్రణము ... ... ... 101
విసర్పి, అగ్నిఅమ్మ ... ... ... 102
విద్రధి, గడ్డ, రక్తవిద్రధి, నెత్తురుగడ్డ, మహావిద్రధి,
రాజవ్రణము, రాచకురుపు ... ... 102
మహావిద్రధి, రాజవ్రణము, రాచపుండు, రాచకురుపు 103
స్తనవిద్రధి ... ... ... 103
సర్షపికా ... ... ... 104
మశరోగము, పులిపిరికాయ ... ... 104
కుష్ఠము, పెద్దనొప్పి ... ... ... 104
రాజికా, చెమటకాయ ... .. [illegible]
నాడీవ్రణము, తంతువ్రణము, నారపుండు .. [illegible]
నాడీవిద్రధి ... ... .. [illegible]
శ్లీపదము, ఏనుగుకాలు, పాదార్బుదము, హస్తార్బుద
ము, పాదవల్మీకము ... .. [illegible]

ఉత్కోఠరోగము, ఎంగిలిచిడుము, తామర, మేహపొడ 107
పాదభేదము, గుదికాళ్ళపగులు ... ... 107
ముఖదూషికము, మొటిమ ... ... 108
లాంఛనము, మచ్చ, వ్యంగము ... ... 108
అజగల్లి, బొబ్బలు ... ... ... 108
వంక్షణస్థానవిద్రధి, ఒడిసెగడ్డ ... ... 109
ఉపదంశము, లింగవ్రణము, మేహవ్రణము, గుహ్యవ్రణము, అలజివ్రణము, ఫిరంగిరోగము, ఓష్ఠఫిరంగి, కొరుకు ... ... ... 109
ఆష్ఠిలికా ఉపదంశము ... ... 110
మృదూపదంశము ... ... ... 111
వ్యాపకోపదంశము ... ... ... 111
పర్యుషితోపదంశము ... ... 112
కండూతి, దద్దులు, పుండ్లు, బొబ్బలు, పామా, కచ్ఛూ, కోష్ఠము 112
శీతపిత్తము, ఆనుపిత్తము, దద్రురోగము, పురుగుకాటు 113
భగంధరము ... ... ... 113
చిల్వము, గోరుచుట్టు, అక్షతరోగము ... 114
అగ్నిరోహిణి, ప్లేగు ... ... ... 114
విదారిక ... ... ... 115
కంఠగ్రంథి, గళగ్రంథి ... ... ... 115
గండమాల, కంఠమాల ... ... ... 116
మసూరికా, స్ఫోటకము, పెద్ద అమ్మవారు, క్షుద్రమసూరికా, చిన్నమ్మ, తట్టమ్మ ... ... 116
స్తన్యవ్రణము, గాయము, క్షతరోగము ... 117
స్తన్యకీలజి, పుట్లాయి అమ్మవారు ... ... 117
పరిభవదము, పైత్యము, పిచ్చి, వెఱ్ఱి, మదము ... 118

స్తనవిద్రధి ... ... ... 137
రజస్సూద్ఘాటము ... ... ... 137
కుంఠాలరోగము, చెవ్వగడ్డ, మచ్చలు ... 138
క్రిమిరోగము ... ... ... 138
మందము, గణరోగము ... ... 138
పాండు ... ... ... 139
కామిలా, పిత్తపాండు, పిత్తకామిలా, యకృతూదరము 139
నపుంసకత్వము ... ... ... 140
ధ్వజభంగము ... ... ... 140
శీఘ్రస్ఖలనము ... ... ... 141
స్వప్నస్ఖలనము ... ... ... 141
శిరోరోగము, తలనొప్పి, అర్ధభేదము... ... 142
శిరస్తాపము, శిరోశూల, కపాలశూల ... ... 143
రక్తశిరస్తాపము ... ... ... 143
ఇంద్రలుప్తము ... ... ... 143
ఖలతి ... ... ... ... 144
యూకారోగము, పేను ... ... 144
పలితము ... ... ... 144
శిరోవ్రణము, చుండు, కరపాణి ... ... 145
కుండాలరోగము ... ... ... 145
కరపాణి ... ... 138-145
విషవ్రజము, కండూతి ... ... 146
ముఖపాకము, శ్లేష్మజిహ్వ, ముఖదూషిక ... 146
ఆస్యపాకము, ముఖపాకము, జిహ్వాలజి ... 146
జిహ్వారోగము ... ... . . 146
జిహ్వాలసము ... ... ... 147

అధిజిహ్వ ... ... ... 147
ఉపజిహ్వ ... ... ... 147
వాతజిహ్వ, జిహ్వాఖండము ... ... 147
పిత్తజిహ్వ ... ... ... 147
జిహ్వాస్తంభము, జిహ్వాస్తంభవాతము ... 148
తాలుపాకము ... ... ... 148
కచ్ఛపము, గవదబిళ్ల ... ... ... 148
తాలుపిటకము ... ... ... 148
తాలుశోష, గళావృతవాతము ... ... 148
ఓష్ఠరోగము ... ... ... 149
ఖండోష్ఠము ... ... ... 149
ఓష్ఠార్బుదము ... ... ... 149
దంతశ్వేదము ... ... ... 149
దంతశూల ... ... ... 149
దంతచలనము, దంతప్రలూనము ... ... 150
దంతపూయము ... ... ... 150
దంతవిద్రధి ... ... ... 150
దంతపుప్పుటము ... ... ... 150
దంతమాంసరోగము, చిగుళ్లనొప్పి ... ... 151
కర్ణపూయము ... ... ... 151
కర్ణశూల, చెవిపోటు ... ... ... 151
కర్ణవిద్రధి, కర్ణతాపితము ... ... 151
కర్ణక్రిమి ... ... ... 152
కర్ణనాదము ... ... ... 152
బాధిర్యము, చెవుడు ... ... ... 152
నేత్రరోగము ... ... ... 153

ప్రవాటోపకము ... ... ... 153
కృచ్ఛ్రోన్మీలనము ... ... ... 153
అరుష్నిమేషము ... ... ... 154
సికతావర్త్మము ... ... ... 154
పక్ష్మపాతము ... ... ... 154
క్లిష్టము ... ... ... 154
కుకూణకము ... ... ... 154
జలస్రావము ... ... ... 155
రక్తస్రావము ... ... ... 155
కఫస్రావము ... ... ... 155
పర్వణి... ... ... ... 155
నేత్రాలజి ... ... ... 155
పూయస్రావము ... ... ... 156
శుక్తికము ... ... ... 156
శుక్లార్మము, అధిమాంసజము ... ... 156
పిటకము, అజికా ... ... ... 156
తిమిరము, చత్వారి ... ... ... 156
నేత్రకాచము ... ... ... 157
లింగనాశము, అంధత్వము ... ... 157
నకులాంధము, పగలుచీకటి ... ... 158
నక్తాంధము, రేచీకటి, ఉష్ణవిదగ్ధము ... 158
ధూమ్రము ... ... ... 158
అభిష్యందము, కన్నుప్పి, కండ్లకలక... ... 158
నేత్రమందము ... .. ... 159
పుష్పము ... ... ... 159
నేత్రకండూతి ... ... ... 159

## విషలక్షణప్రకరణము.


కృత్రిమవిషము, పెట్టుమందు ... ... 160
అకృత్రిమవిషము, స్థావరము, జంగమము, ధాతుజము, విషశిల ... ... ... 161
సర్పదష్టము ... ... ... 162
వృశ్చికదంశము, మండ్రగబ్బ ... ... 165
ఆఘాటిక, జెఱ్ఱిపోతు ... ... ... 167
శతపది, రోకటిబండ ... ... ... 167
[illegible] ... ... ... ... 168
లూతా, సాలెపురుగు... ... ... 168
భ్రమరము, అడవియీగెలు, అడవితేనెటీగెలు, కందిరీగెలు, అడవి-చీమలు, కంబళిపురుగులు ... 168
సరటు, తొండ, ఊసరవెల్లి ... ... 169
నలికండ్లపాము ... ... ... 170
గౌధారము ... ... ... 170
శునకదష్టము, వెఱ్ఱికుక్క ... ... 170
మూషకవిషము, ఎలుక ... ... 172
మండూకము, కప్ప ... ... ... 173
నరదంతవిషము, నఖవిషము ... ... 173


## గ్రహలక్షణప్రకరణము.


ద్వాదశగ్రహనామములు ... ... 176
ద్వాదశగ్రహలక్షణము ... ... 177
బాలగ్రహనామములు ... ... ... 179
బాలగ్రహలక్షణము ... ... ... 180
పక్షిగ్రహములు ... ... ... 184
పక్షిగ్రహలక్షణము ... ... ... 184

## చికిత్సాప్రకరణము.


మూలికాలక్షణము ... ... ... 186

మూలికానిర్ణయము ... ... ... 187

ఔషధసేవనవేగము ... ... ... 188

ఔషధవేగము ... ... ... 189

ఔషధస్పర్శవేగము ... ... ... 189

ఔషధసేవనకాలము ... ... 189

ద్రవ్యశుద్ధి ... ... ... 190

విషప్రతివిషములు ... ... ... 193




# పీఠిక.



శ్రీకరుండైన భగవంతుఁడు ప్రపంచమునం దలి ప్రజలకును తక్కిన జంతు జాలమునకును ప్రయోజనకారి యగు నట్లుగా ఓషధులను సృష్టించి యున్నాఁడు. కావుననే "నాస్తిమూల మనౌషధమ్" అని యార్యులనెదరు. ఈ ఓషధులే జననమునకును గారణమై యున్నది. మరియు వైద్యమునందు మూఁడు విధములైన పద్ధతులు కలవు. అనఁగా 1 దేవవైద్యము, 2 రాక్షసవైద్యము, 3 మనుష్యవైద్యము, అని త్రివిధములు. దేవవైద్యమునకు రస విష గంధకాదులు రోగాపహార ద్రవ్యములు. రాక్షస వైద్యమునకు శస్త్ర క్షారాగ్ని కర్మలు రోగపరిహారక క్రియలు. మనుష్య వైద్యమునకు కంద మూల ఫలాదులు చికిత్సార్థములు. కనుక ఈ గ్రంథమునందు చెప్పఁబడు చికిత్స లన్నియును మూలికలతో సంబంధించినవిగా నుండును.

ఒక్కొక వ్యాధికి నొక్కొక మూలికయే చెప్పవలసి యుండియు రెండుకూడ కలిసియున్నదిక దాయని యాక్షేపించు వారికి సమాధాన మేమనఁగా, ఔషధము రాజు అనియును, అనుపానము మంత్రి అనియును, వైద్యశాస్త్ర వేత్తలు చెప్పియుండుటం బట్టి అనుపానార్థమై చేర్పఁబడి యున్నదని గ్రహింప వలయును. మఱియు పురుషుఁడు ఔషధము అనియును, ప్రకృతి అనుపానమనియును అనుభవజ్ఞుల మతము.

ఈ గ్రంథమునం దొక్కొక వ్యాధికిని ఒక్కొక మూలికయే చెప్పఁబడి యుండుటం బట్టి దీనికి "ఏక మూలికా ప్రయోగ రత్నావళి" యని పేరిడఁబడెను. ఈ గ్రంథమును పఠించువారందఱును మొదటనుండి క్రమముగాఁ జదివిన పిదప ఔషధములను చేయుటకును సేవించుటకును బ్రయత్నింప వలయును. అట్లు పఠింపక ఔషధములు చేసినను సేవించినను దుర్గుణము మాత్రము కలుగదు.

కుండలి యోగంబు లన్నియును అనుభవ సిద్ధములైనవి. వ్యయ ప్రయాసము లుండవు. గోరక్షాది మహాత్ముల కటాక్ష లబ్ధములై మహారహస్యములై వైద్యజన జీవనములై వెలయు నీయౌషధములు సకలమైన వారికిని సులభలభ్యంబగునట్లు ప్రకటించినాఁడను.

విద్యోన్నతి ఆఫీసు, మద్రాస్.
శ్రీ జయదశమి.
1907.

ఇట్లు
ఓమందూరు, వైద్యం,
శ్రీ, వీరాస్వామయ్య.

# జ్ఞాపిక.



వ్యాధిగ్రస్తులకు ఉపచారములు చేయుటకు సమీపమున మనుష్యులుండవలసినది యత్యావశ్యకము. అట్లుండువారు రోగి వినునట్లు అయ్యో, అవ్వా, కన్నులు లోనికి పోయినది, కాళ్లు చేతులు చల్లనైనవి, ముఖము వివర్ణమైనది, నాకు చూడఁగా సందేహముగ నున్నదియని చెప్పఁగూడదు. వైద్యుఁడును చెయిచూచినమీఁద "ఈ రోగం కుదుకుతుందా, నా కేంతోచదమ్మా, ఇట్లేయుండేగదా మొన్న సుంకడు చచ్చినాఁడు" అనియును చెప్పఁగూడదు. ఎంతసేపటికిని వ్యాధిగ్రస్తుని బంధుమిత్రాదులకు వైద్యుఁడైనవాఁడు కొండంతరోగమును గోరంతగా చెప్పుచు మందునుమాత్రము ప్రాణోత్క్రమణమగువఱకిచ్చుచుండవలయును. రోగి సమీపమున నుండువారును, వైద్యుఁడును, చెప్పునట్టి ధైర్యవచనములు రోగికి ఔషధమున

కంటె మిగులగుణమునిచ్చును. మఱియు వైద్యుఁడు
ఎంతటి ప్రసిద్ధిఁగాంచినవాఁడైయైనను కొన్నిసమయ
ములయందు వ్యాధికితగినయౌషధము లేకయుండ
వచ్చును. అట్టిసమయమున మఱియొక వైద్యుని
సహాయమును గోరినయెడల మేలుకలుగును. కొం
దఱు తమయింటి వైద్యుఁడే మన్నిచ్చిన నది సంజీ
వియనియును, వేఱొక్క వైద్యుఁడు సంజీవినిచ్చిన
నదిమట్టియనియును దలంచెదరు. ఇందుచేత నేయ
నేకులు యమలోకమునకుం బోయెదరు. మఱియు
వైద్యులలోను గొందఱు తమయొద్ద మందు లేదని
చెప్పక సకలవ్యాధులను నివర్తింపఁజేయు పక్వౌష
ధములును గలవని నమ్మించి విత్తమును బ్రాణ
మును గైకొనుచున్నారు. ఈ విషయములను రోగు
లును రోగియొక్క బంధుమిత్రాదులును వైద్యు
లును జ్ఞప్తియందుంచుకొనుట శ్రేయస్కరము.

---

తీపును గల పదార్థములను సేవింపరాదు. కాలమునకును శరీరమునకును దగిన పదార్థములనే భోజనము చేయవలయును.

5. నిద్ర:—బిడ్డలకు నిద్ర విశేషముగా కావలయును. కనుక పగటియందును నిద్రపోవచ్చును. పెద్దలు పగటియందు నిద్రపోరాదు. బడలిక చెందినవారును, అశక్తులును, వ్యాధిగ్రస్తులును మాత్రము పగటియందు కొంచెముసేపు నిద్రపోవచ్చును. ప్రతివారికిని దినమునకు ఎనిమిదిగంటల సేపు నిద్ర కావలయును.

6. వాసస్థానము:—వీథికంటె కొంచెము పొడవైన స్థలమునందు వాసము చేయవలయును. చెమ్మనేలగా నుండఁగూడదు. సంవత్సరమునకు రెండుమాఱ్లు గోడలకు సున్నము కొట్టవలయును. అప్పుడప్పుడు వాసస్థలములను కడుగుచుండవలయును. బూజును కరిధూపమును చాలాదినము లుంచరాదు. మట్టినేలను వారమున కొకమాఱు అలకవలయును. గచ్చునేలను ఱాతినేలను వార

మున కొంకతూరి కడుగవలయును. నేలపై శయ నించుటకంటె మంచము మిగులమంచిది. శయ నించుస్థలము గాలివచ్చునట్టిదిగా నుండవలయును. అధిక జనులు వసించు గృహమునందు సదా రోగ దేవత వాసము చేయుచుండును. కనుక జనుల సంఖ్యకుఁ దగినంత మాత్రము గృహమునుండవల యును.

7. వస్త్రములు:—ప్రతినిత్యమును ఉతికిన బట్టలనే ధరింపవలయును. మురికియై కంపుగొట్టు వస్త్రములను వదలవలయును. ఇతరులవస్త్రము లను, రోగులగుడ్డలను ధరింపరాదు. బట్టలను నడు మునందు బిగించికట్టరాదు. ఇట్లుకట్టుకొనుట వలన రొండిగజ్జి కలుగును.

8. వృత్తి:—ప్రతిమనుష్యుఁడును ప్రతిస్త్రీ యును శరీరబలమునకుం దగినంత పనినే చేయ వలయును. బడలికచెందునట్లు పనిచేసి తర్వాత ఒడలుమఱచి పరుండరాదు. స్నానముచేయక భుజింపఁదగదు.

## ఔషధసేవనప్రమాణము.

| వయస్సు మొదలు. | వయస్సు వఱకును. | చెప్పినప్రమాణమున భాగము. | |
|---|---|---|---|
| 1 నెల మొదలు | 3 నెల వఱకు. | 16 లో॰ ఒకభాగము. | $\frac{1}{16}$ |
| 4 నెల మొదలు | 1 సం. వఱకు. | 12 లో॰ ఒకభాగము. | $\frac{1}{12}$ |
| 2 సం. మొదలు | 2 సం. వఱకు. | 8 లో॰ ఒకభాగము. | $\frac{1}{8}$ |
| 3 సం. మొదలు | 3 సం. వఱకు. | 6 లో॰ ఒకభాగము. | $\frac{1}{6}$ |
| 4 సం. మొదలు | 4 సం. వఱకు. | 4 లో॰ ఒకభాగము. | $\frac{1}{4}$ |
| 5 సం. మొదలు | 7 సం. వఱకు. | 3 లో॰ ఒకభాగము. | [illegible] |
| 8 సం. మొదలు | 14 సం. వఱకు. | 2 లో॰ ఒకభాగము. | [illegible] |
| 15 సం. మొదలు | 20 సం. వఱకు. | 3 లో॰ రెండుభాగము | |
| 21 సం. మొదలు | 60 సం. వఱకు. | చెప్పినంతప్రమాణము. | |

ఈ ప్రమాణపద్ధతిని మఱికొందఱు వేఱు విధముగా విభజించి యున్నారు. అయినను అనేకుల యభిమతమునే యిచ్చట విశదీకరింపఁబడి యున్నదని గ్రహించునది.

## ఔషధమానము.

| | |
|---|---|
| 1 గరిటె(టీస్పూన్) | 1 డ్రాము. |
| 1 వరహాయెత్తు | 1 డ్రాము. |
| 32 గుంజలు | 1 వరహాయెత్తు. |
| ½ గుంజయెత్తు | 1 గ్రెయిన్. |
| 1 ఔన్సు | 2½ రూపాయయెత్తు. |
| 1 రూపాయయెత్తు | 1 తులము. |
| 3 డ్రాములు | 1 తులము. |
| 3 తులములు | 1 పలము. |
| 1 ఔన్సు | (ఉ౽)⅞ పలము. |
| 8 డ్రాములు | 1 ఔన్సు. |
| 24 ఔన్సులు | 1 బుడ్డి. |
| 10 డ్రాములు | 1 పలము. |
| 8 పలములు | 1 సేరు. |
| 5 సేర్లు | 1 వీసె. |
| 6 ఔన్సులు | 1 అళాకు. |
| 5 పలములు | 1 అళాకు. |
| 8 ఆళాకులు | 1 పడి. |

౩. పురుషులకు శ్లేష్మనాడి సర్పము వలెను కప్పవలెను నడచును.

స్త్రీలకు శ్లేష్మనాడి హంసవలె నడచును.

## నాడీ నిర్ణయము.

పురుషులకు కుడిచేతిని, స్త్రీలకు ఎడమచేతిని పరీక్ష చేయవలయునని శాస్త్రములయందు చెప్పఁబడియున్నను, రెండు చేతులను పరీక్షించుటయే ఉత్తమము. నాడిని పరీక్షించి రోగమును నిర్ణయించుట మిగుల ప్రయాసమైనది.

రోగమును నాడిచేఁ బరీక్షించుట కంటెను రోగియొక్క బాల్యాది చేష్టలను, శరీరస్థితిని, ఆహార విహారాదులను అడిగి తెలిసికొని నిర్ధరించుట సర్వోత్తమము.

---

ఉండదు. ఎక్కిళ్లు, దగ్గు, ఉబ్బసము, చెమట, క్షయము, ఇవి కలుగును. గొంతును పక్కలును నొప్పిగా నుండును. నోటినుండి రక్తము పడును. నాలుక నునుపుగా నుండును. నోరూరుచుండును. నాలుకయందు తీపెక్కి యుండును.

3. శ్లేష్మక్షీణ స్థితి:—నాడి దుర్బలముగ నుండును. చెమట బుట్టును. శుక్లము క్షయమగును. బుద్ధి భ్రంశముగ నుండును.

ద్వంద్వరోగములయందు నానావిధములుగ పైన చెప్పిన స్థితులే సంకరములై యుండును.



శ్రీ.

ఆరోగ్యమస్తు.

# ఏకమూలికాప్రయోగరత్నావళి.



## పరిభాషా ప్రకరణము.



### వైద్యలక్షణము.

వైద్యుఁడు గమనించవలసిన ముఖ్య విషయములు :— తామ్రము, ఇత్తడి, కంచు, వీనియందు ఔషధము నుంచరాదు.

ఔషధమునం దనేక వస్తువులను జేర్పరాదు. ముఖ్యమైన ఒకటి రెండు వస్తువులను మాత్రము చేర్పవచ్చును. అనఁగా ఆ ఓషధియొక్క గుణమును హెచ్చుచేయుటకును, లేక దానియందలి దుర్గుణమును మాన్పుటకును మాత్రము తగిన వస్తువును చేర్పవలయును.

కొందఱు పూర్వులుచెప్పిన యోగములను మార్చరాదందురు. అది అవివేకము.

ఔషధమును ప్రమాణము నతిక్రమించి యీయరాదు. అట్లు ఇచ్చినచో వికటించి ప్రాణాపాయమును గలుగఁజేయును.

జీడి, జముడు, జిల్లేడు, గన్నేరు, నాభి, అభిని, మొదలగు పదార్థములను జాగ్రత్తతో వాడవలయును.

వైద్యుఁడు రోగియొక్క వయస్సును, శరీర ప్రకృతిని, వ్యాపారములను, దీపనస్థితిని, తత్కాల స్థితిని, అష్టవిధ పరీక్షలను తెలిసికొని ఔషధ మియ్యవలయును.

## పథ్యవిధి.

ఈ గ్రంథమున పథ్యమే చెప్పనిచోట ఇచ్ఛాపథ్యమనియే గ్రహింప వలయును. పథ్యము చెప్పినచోట ఆ లాగుననే చేసికొనవలయును.

ఇచ్ఛాపథ్య మనఁగా, కాకరకాయ, గుమ్మడి కాయ, ముల్లంగి, గోరుచిక్కుడుకాయ, అవిసి, నువ్వులు, నూనె, ఆవాలు, ఇంగువ, మామిడి కాయ, పచ్చిమిరపకాయలు, దోసకాయ, సొర కాయ, పెండలము, గెనుసుగడ్డ, మందము చేయు పదార్థములు అగు వీనిని వర్జింపవలసినది.

పథ్య పదార్థములు.

పొట్లపిందెలు, అత్తిపిందెలు, చిక్కుడుపిందెలు, వంగపిందెలు, మునగపిందెలు, తరుగుకూర, కందులు, గోధుమలు, చిర్రికూర, పాతచింతపండు, బీరపిందెలు, సద్యోఘృతము, పొన్నగంటికూర, మామిడి వరుగులు, అరఁటిపిందెలు, అరఁటిపువ్వు, బెండపిందెలు, వెల్లుల్లి, ద్రాక్ష, ఆల్‌బోకారా, పులిచింత, పుదీనా, అల్లము, మేకమాంసము, ఇవి పథ్యమునకగును. ఇచ్ఛాపథ్యమునందు పైనచెప్పిన పదార్థములను వాడుకొనవచ్చును.

జ్వర రోగమునందు పాలు, నేయి, వెన్న, చింతపండు, బెల్లము, మత్స్యమాంసాదులు, ఇవి

పనికిరాదు. కొంచెముగ పాలును, కొంచెముగ పులుసును మాత్రము చేర్చుకొనవచ్చును.

### లంఘనము.

లంఘనమనఁగా రోగికి ఆహారము నియ్యక ఉపవాస ముండునట్లు చేయుట. అశక్తులకు లంఘనము తగదు. మఱియు జ్వరము, కడుపునొప్పి, కంటినొప్పి, వ్రణరోగము, శిరోరోగము గలవారికి మాత్రము లంఘనము తగునని శాస్త్రములయందు చెప్పఁబడి యున్నది. అయినను జ్వరాదికాలమునందు తప్ప తదితర రోగములలో లంఘనము కూడదు.

### పాకలక్షణము.

ఈ గ్రంథమునందు చెప్పిన ఔషధము లన్నియును నీ దిగువ నుదహరించిన పద్ధతిప్రకారముగాఁ జేసికొనవలయును.

మఱియుఁగొన్ని పాకములు దీనికి సంబంధించి యుండక పోయినను యుక్త సమయములయందు ఉపకరించునని వ్రాయంబడియె.

## శృత కషాయము.

పట్ట, ఎండినట్టి వస్తువులు, గట్టి దినుసులు వీనిని నలియగొట్టి నీళ్లలో వేసి కాచి నాలుగింట నొక భాగముగా దించుకొనునది. దీనికే "చాతుర్భాగావశేషిత కషాయము" అని పేరు.

## పదార్థసార కషాయము.

పైన చెప్పఁబడినట్టి వస్తువులుగాక పూలు, ఓమము, జలకర మొదలయిన అల్పవస్తువులను నీళ్లలో వేసి కాచుటచే గుణము తగ్గిపోవును. కనుక ఇట్టివస్తువులను కషాయము చేయుఁడని చెప్పిన స్థలములందు, నీళ్లను బాగామరగ నిచ్చి ఆనీళ్లను వేఱొక పాత్రయందు కావలసినంత వంచికొని అందు పైనచెప్పిన పూలు మొదలగు అల్పవస్తువులను చూర్ణముచేసివేసి మూతబెట్టి ఆవస్తువుల ఘనత్వ లఘుత్వ పరిమాణము ననుసరించి 10 మొదలు 30 నిమిషము లుంచి ఆ మీఁద వడియగట్టి పుచ్చుకొన వలయును. కఠినమైన వస్తువులను మాత్రము 6 ఘంటలసేపు నానబెట్ట వలయును.

## శీతోదక కషాయము.

కొన్ని వస్తువులను బాగా చిదుకగొట్టి శీతల జలమునందు నానవేసి 6 ఘంటల సేపునకు తర్వాత పుచ్చుకొనుట. దీనికి సిత కషాయ మనియును నామము కలదు.

## స్వరస కషాయము.

ఆకులు, పచ్చివేళ్లు, పచ్చిపట్ట, అల్లము, ఈ మొదలగు వానిని దంచి పిండుకొనినట్టి రసమునకు స్వరస కషాయమని పేరు.

## కల్క కషాయము.

అతిమధురము, సొంటి, మొదలగు ఎండిన వస్తువులను నీళ్లుపోసి నూరి పిండుకొనుట.

కాచునట్టి కషాయములు 10 మొదలు 30 నిమిషముల కంటె హెచ్చుగా కాచరాదు.

కఠిన వస్తువులను పదార్థసార కషాయముగా జేయునపుడు 1 ఘంట మొదలు 6 ఘంటలసేపు

కంటె హెచ్చుగా వస్తువులను వేడి నీళ్లలో నుంచ కూడదు.

శీతోదక కషాయమునందు 6 ఘంటల సేపు వస్తువులను నానబెట్టి యుంచుట మంచిది.

కొందఱు భాండ కషాయ మని 3 మొదలు 7 దినముల దాఁక పొయిమీఁదనే యుంచుట కలదు. అది శ్రేష్ఠమైనది కాదు.

కషాయములను ఆయాపూఁటయందే చేసికొన వలయును. అట్లు చేసికొనని యెడల విరుద్ధమైన గుణమును కలిగించి చెడుపు చేయును.

పెద్దలకు కషాయమును పరక మొదలు కాలు అళాకును, పిన్నలకు పైనచెప్పిన కొలతలో ఎనిమిదింట లేక పదునాఱింట నొక భాగమును ఇయ్య వలయును.

## పంచకర్మములు.

1. స్నేహనవిధి, 2. స్వేదవిధి, 3. వమనవిధి, 4. విరేచనవిధి, 5. నస్యవిధి.

## స్నేహన విధి.

తైలాదులను లేపనముచేయుట, చరుముట, రాచుట మొదలగునవి. దీనికి లేపనమనియును పేరుగలదు.

## స్వేద విధి.

బాగా చెమట పట్టునట్లు వేడినీళ్ల యొక్క ఆవిరిని పట్టుట. దీనికి కుంభసేకమనియును పేరు కలదు. తత్కాలమునందిది "టర్కిష్ బాత్" అనఁబడుచున్నది.

## వమన విధి.

వాంతి యగునట్లు ఔషధములను పుచ్చు కొనుట.

## విరేచన విధి.

భేదికిపుచ్చుకొనిజీర్ణాశయమును శుద్ధిపఱుచుట.

## నస్య విధి.

కొన్ని మూలికలరసమును నాసికారంధ్రముల యందు పోయుట, లేక పీల్చుట.

## అంజనము.

కొన్ని వస్తువుల సముదాయముచేత చేసినట్టి మాత్రను చాదిగాని, లేక మూలికలరసమునుగాని, తైలాదులను గాని, నవనీతమునుగాని నేత్రముల యం దుంచుట. ఇదే కలికము.

## గండూషము.

ఏదేని వస్తువులను వేసి నానబెట్టిన జలము తో పుక్కిలించుట.

## వస్తిశోధనము.

నాళముద్వారా జలమును గుదస్థానమునందు ప్రవేశింపజేసి మలశోధనము చేయుట. ఇందు వలన మలకోశము శుద్ధియగును. ఘాత్రికవుపు పలచనగును. ఇది హఠయోగులయొక్క షట్కర్మములలో నొకటియై యున్నది. ప్రకృతమునందు ఆంగ్లేయులు దీనిని "ఇనీమా" యనెదరు.

## నాళికా శోధనము.

చిమ్మనగ్రోవిద్వారా జలమును యోనిస్థానము, కర్ణరంధ్రము, మొనియందు ప్రవేశింపజేసి

మలినమును వెలికిఁదీసి శుద్ధిచేయుట. ఇది వస్తి శోధమునం దొక భేదము. దీనిని వస్తిపీడనము అనియుం జెప్పుదురు.

ముఖనిక్షిప్తము.

అతిమధురము, కరకాయబరడు మొదలగు వస్తువులను పుక్కిటియం దుంచికొని ఆ రసమును గ్రహించుట.

నిబంధము.

గడ్డలు మొదలగువానికి బియ్యపుపిండి, లేక మూలికలు, ఉడకబెట్టి కట్టుట.

బంధము.

గాయములు కలిగినపుడును, లేక అవయవములు స్థానము దప్పినను, విరిగినను, బద్దపెట్టి కట్టుట. ఇది ఆంగ్లేయ భాషయందు "బాండేజి" యనఁబడును.

మర్దనము.

తైలాదులను వ్యాధిగల స్థలమునందు లేపనముచేసి చేతితో పట్టుట.

### తాపనము.

వ్యాధిబాధగలచోట ఇసుక, తవుడు,(నున్న) ఆకులు, ఈ మొదలగువానిని వేయించి గుడ్డలో మూటకట్టిగాని, లేక వేడినీళ్లను గాజుబుడ్డియం దుంచిగాని ఒత్తుబెట్టుట. ఇదే తాపడము.

### లేపనము.

తలనొప్పి, గడ్డ, ఈ మొదలగువానికి పట్టు వేయుట. పంచకర్మములలో స్నేహనవిధిని చూడుము.

### అభ్యంగనము.

తైలము, మూలికల రసము, జంబీరఫల రస ము, ఇత్యాది స్నేహవస్తువులను తలకు రాచు కొని స్నానము చేయుట.

### చూర్ణము.

పదార్థములను చక్కఁగా దంచి వస్త్రఘాళి తము చేసికొనుట.

## కల్కము.

ఔషధ యోగములయందు జేర్చుట కొఱకైన కొన్ని వస్తువులు చేరిన సముదాయము. ఇదే కల్కద్రవ్యము.

## ఘుటిక.

ఔషధవస్తువులనునూరి చిన్నచిన్న మాత్రలుగాఁజేసి యెండలో నుంచిగాని, లేక నీడలోనుంచి గాని యెండబెట్టుట. దీనినే వటకము, మాత్ర, గుటిక యనియుం జెప్పుదురు.

## రక్తమోక్షణము.

శరీరమునందెచ్చోటనైన గడ్డలు మొదలగునవి కలిగినప్పుడును హస్తపాదములందు రక్తము హెచ్చుగా నుండినపుడును మూలికాదులను కట్టిగాని, లేక జలగను కరిపించిగాని, లేక సలాకుతో పొడిచిగాని రక్తమును దీయుట.

## ధూమపానము.

కొన్ని మూలికలు చేర్చిన చుట్టను గాని, లేక మూలికాదుల చూర్ణమును నిప్పు మీఁద వేసిన

పొగనుగాని, వేము మొదలగు కొయ్యలను గాని, కాల్చి పీల్చుట.

### ధూమవర్తి.

మూలికాదుల రసమున తడిపి యెండించిన గుడ్డను వర్తిగాఁజేసి కాల్చి ముక్కుతో పీల్చుట. దీనిని ఆఘ్రాణవర్తియనియుం జెప్పుదురు.

### ధూపము.

సాంబ్రాణి, లేక మఱికొన్ని యితరవస్తువులను పొడుముచేసి నిప్పుమీఁదవేసి ఆ పొగను శరీరమున సోకించుట.

### ఆఘ్రాణము.

కొన్ని వస్తువులను మూర్కొనుట. అనఁగా వాసన చూచుట.

### పొట్టణము.

ఏదేని మూలికలను ఆకులయందు చుట్టి కుంపటిలోగాని కుమ్ములోగాని యుంచి ఉడికించి తీసి కొనుట. ఇది పుటపాకభేదము.

## పుటపాకము.

మూలికాదులను ఆకులలోఁ జుట్టి కుమ్ములోఁ నుంచి దీసి వానియొక్క రసమును పిండుకొనుట.

## పిష్టపాకము.

ఏదేనిమూలికలను రోటిలోవేసి దంచి (మోదక భక్ష్యములుచేయు నట్లుగా) వాసెనమీఁద బెట్టి ఆవగించి తీసికొనుట.

## చిక్కణపాకము.

లేహ్యాదులను ఉండచేసినపుడు అందు పల్లము పడినయెడల అది చిక్కణ పాక మనఁబడును. అనఁగా, ఔషధమును చేతితోదీసి యుండ చేయు నపుడే చేతికి యంటుకొనునట్టి పాకము.

## మృదుపాకము.

ఔషధమును చేతికితీసినపుడు అది అంటకుండు నేని మృదుపాక మనఁబడును. అనఁగా, ఔషధ

మును అపకతో దీయునపుడు కొంచెము జలము కల్గినట్లుగను, కరిగినమైనమువలెను కనంబడును.

మధుపాకము.

తేనెవలె వచ్చునట్టిపాకము. ఇది తంతుపాకమునకంటె కొంచెము గురుత్వమైనది.

తంతుపాకము.

నూలి పోగువలె సాగునట్టి పాకము. ఇది మధపాకమునకంటె కొంచెము తేటగానుండును.

ఖరపాకము.

జలమునందు వ్రేళ్లను తడుపుకొని లేహ్యమును దీసి చూడఁగా అది మెత్తగను గుళికవలెను వచ్చునట్టిదిగ నుండును. ఇది మధుపాకమునకంటె కొంచెము గురుత్వము కలదిగా నుండును.

లేహ్యము.

కొన్నివస్తువులను నెయ్యి, తేనె, చక్కెర, వీనితో మృదుపాకముగాఁ జేయుట.

## ఘృతము.

కొన్ని వస్తువుల యొక్క చూర్ణమునకంటె రెండు మూఁడింతలు నేయిపోసి మధుపాకముగా కాచి దించికొనుట.

## తైలము.

కొన్ని వస్తువులను నూనెలో వేసి కాచి చిటచిటలు లేనిసమయమును పరీక్షించి దించి అపుడే వడియగట్టి వేఱొక పాత్రయందుంచి నోటికి గుడ్డకట్టి ధాన్యపుటమున బెట్టి ౧౦ దినములకు మీఁద ౪౦ దినములకులోపల తీసికొనవలయును. తైలము బాగా పక్వమైనదని తెలియుట యెట్లనఁగా, ఆనూనెను వత్తిలో తడిపి దీపమున వెలిగించినపుడు చిటచిట శబ్దము లేకుండవలయును.

## శిఖాతైలము.

ఏదేని వస్తువులను గుడ్డలో మూటగట్టి నూనెలోతడిపి దీపము సెగయందుంచఁగా కారునట్టి తైలము. దీనినే "కొడిచమురు" అనియుఁ జెప్పుదురు.

## పుటతైలము.

ఒకకుండకు అడుగున చిన్నరంధ్రముచేసి అందు నల్లవెంపలితో సమానమైన వస్తువులను నించి కుండనోటికి చీలమన్నిచ్చి క్రిందిభాగమునందు తైలము స్రవించుటకై పాత్రను(చిన్నకుప్పెను, లేక గాజుగిన్నెను) ఉంచి పుటముపెట్టుట. దీనినే పాతాళయంత్రమనియుం జెప్పుదురు.

## ఆతప తైలము.

అంకోల (ఊడుగ) బీజములు మొదలగువానిని నూరి ఒకతట్టయందుంచి, దానిని ఏటవాలుగా ఎండలోఁబెట్టిన యెడల ఆకల్కద్రవ్యమునుండి తైలము స్రవించును.

## దీపాగ్ని.

రెండుఁ వ్రేళ్ల లావుగల ఒక్కొకకట్టెతో మంట బెట్టుట. దీనికి మందాగ్నియనియు పేరుకలదు.

## కమలాగ్ని.

పైనచెప్పినట్టి ప్రమాణముగల రెండుకట్టెలతో మంటబెట్టుట.

### గాఢాగ్ని.

పైన చెప్పినట్టి ప్రమాణముగల ౪-౫ కట్టెలతో మంట పెట్టుట.

### సూర్య పుటము.

ఓషధులను గాని, లేక ఇతర పదార్థములను గాని ఎండ పెట్టుట.

### ధాన్య పుటము.

లేహ్యమునుగాని, తైలమునుగాని కొన్నిదినములు వడ్లలోనుంచి యుంచుట.

### పతంగ విధి.

కర్పూరము, సాంబ్రాణి, మొదలగు వస్తువులలో దేని నైనను పాత్రమునందుంచి పైగమూత వేసి చీలచేసి మంటచేసిన యెడల, ఆమూతయొక్క అడుగున వస్తుసారము అంటియుండును. దీనికి ఊర్ధ్వ పతంగవిధి యనియు పేరు కలదు. ఇది విద్యాధరయంత్ర భేదము.

## అధోపతంగ విధి.

పాత్రకు వాసెన కట్టి అందు కర్పూరము, సాంబ్రాణి మొదలగు వస్తువులనుంచి, దానిమీద నొకతట్టలో బొగ్గులనిప్పు నుంచి యుంచుట. ఇట్లు చేసినపుడు వస్తుసారము అడుగు పాత్రయం దుండును.

ఔషధములకు పతంగించినట్టి వస్తుసారమునే వాడవలయును.

## డోలా యంత్రము.

వస్తువులను మూటగట్టి మీదుగా వ్రేలాడ గట్టుట. లేక వస్తువుల మూటను కాగుచుండు నీళ్ల లో పడకుండునట్లుగా ఆమూట నొక అడ్డకొయ్య కు తగిలించి యుంచుట.

## నాళికా యంత్రము.

సారాయి దించునట్లుగా బట్టి కట్టి ద్రావకము తీయుట. ఓమము మొదలగు ద్రావకము లీప్రకా

రమే చేయుతగినది. దీనికి తేజోయంత్రమనియును, అంబికాయంత్రమనియును, ఊర్ధ్వనళికాయంత్ర మనియును పేర్లు కలవు.

పెద్దజీలకర (సోపు), ఓమము, మొదలగు వస్తువులను ద్రావకము చేయునపుడు వస్తువులను సన్నబట్టలో మూటగట్టి కుండలో దిగువ తాకకుండునట్లు (డోలాయంత్ర విధిప్రకారముగా) ఉంచి, ద్రావకము తీసికొన వలయును. ఆ వస్తువుల ప్రమాణము ఒక వీసెగా నుండినపుడు దానికి 6 బుడ్లనీళ్లు పోయవలయును. ద్రావకము 4 బుడ్లే దించుకొన వలయును.

## జలయంత్రము.

ఔషధముల నొకపాత్రయందు వేసి, వేఱొక నీళ్లుకాగుచుండు పాత్రయందు, ఆ ఔషధముగల పాత్రనుంచి పక్వముచేసి తీసికొనుట. ఇది మతాంతర జలయంత్రము.

## రసాయనము.

సుగంధపాల మొదలగు కఠినవస్తువులకు ఏని మిదిపాళ్లు నీళ్లుపోసి నాలుగుపాళ్లుగాడించి వడియ గట్టుకొని, ఆవడియగట్టుకొన్న కషాయమునకు రెండుమూడింతలు చక్కెరచేర్చి మధుపాకముగ వండి ఉంచుకొనవలయును.

ఎండినట్టి పండ్లు, పూలు, ఆకులు మొదలగు వానిని రసాయనము చేయవలసినపుడు ఆవస్తువు లకు నాలుగుపాళ్లు నీళ్లుపోసి అనుకూలముకొలది 1-2-3 దినములకంటె హెచ్చుగా నుండనీయక నాననిచ్చి పిసికి వడియఁ గట్టుకొని ఆవస్తువుల రుచి ననుసరించి రెండు మూడింతలు చక్కెరనుచేర్చి కాచి మధుపాకముగ తీసికొనునది.

పండ్లరసము, లేక స్వరసమును రసాయనము చేయునపుడు దానికి 2 లేక 3 భాగములు చక్కెర చేర్చి మధుపాకముగ డించికొనవలయును. ఈరసా యనము ఆధునికశాస్త్ర పద్ధతి. దీనినే "షర్బత్" అని యూనానిభాషయందు వాడెదరు.

## ఉపసంశ్లేషము.

కొరకాయిందెలు, మాదీఫలము, మొదలగువానిని లవణముతోఁ జేర్చి నానవేయుట. ఇదే ఊరగాయ యనఁబడును.

## భావనము.

ఏదేని రసమునందు వస్తువులను వేసి ఆ రసము వస్తువులయందు ఇగురునంతవఱకు ఉంచియుంచుట.



శ్రీ.

ఆరోగ్యమస్తు.

# ఏకమూలికా ప్రయోగరత్నావళి.



## రోగలక్షణ ప్రకరణము.

ఈ ప్రకరణమునందు రోగలక్షణములు జెప్పఁబడును. ఒక్కొక్క రోగము నందు ననేక భేదములు కలవు. అవియన్నియును ప్రధానరోగలక్షణముతో సంబంధించియే యుండును. కావున విస్తరింపక విరమింపఁ బడియెను.

### రోగ వర్గము.

వైద్యశాస్త్రజ్ఞులు రోగవర్గములను పలు విధములుగాఁ జెప్పియున్నారు. ఆపద్ధతులు ఆయా గ్రంథపారిభాషిక వ్యవహారోప యుక్తములే గాని సర్వసాధారణముగా నుపయుక్తములు కావు.

అయినను సకల గ్రంథములలోని రోగవర్గముల నంతయు నిట వ్యక్తీకరింపఁ బడియెడిని.

1. ఘాత రోగము = దెబ్బచేతను, కత్తివాటు చేతను, అపాయము చేతను, శరీరమును చెడుపు రోగము.

2. గ్రంథిరోగము=గజ్జ, వాపు, దద్దు, మొదలగు రోగములు.

3. శిరోరోగము=తల, మెదడు, మొదలగు వానికి కలుగు రోగము.

4. భూతగణరోగము=భయపడుటచేత కలుగు రోగము.

5. పారంపర్యరోగము=ఇది తమ వంశము నందు పెద్దల కున్నరోగము.

6. ఆగంతుకరోగము=పిషూచి, స్ఫోటకము మొదలగు రోగములు.

7. నిజరోగము = శరీరమును క్రమముగా రక్షింపనందు చే కలుగురోగము.

8. మానసరోగము=చింతచేకలుగు రోగము.

9. స్వాభావిక రోగము=తలనొప్పి, జ్వరము మొదలగు రోగములు.

10. శస్త్రసాధ్యరోగము=గడ్డ, కంతులు, మొదలగు రోగములు.

11. సాధ్యరోగము = ఔషధముచే నివృత్తి యగు రోగము.

12. కష్టసాధ్యరోగము = దినముల కొలఁది కఠిన పథ్యాదులచే శమించు రోగము.

13. అసాధ్యరోగము = ఔషధముచే నివృత్తి కాని రోగము.

ఇట్లు రోగములను నిర్ణయించి విభజించియు న్నారు. అయినను అనుభవజ్ఞులు ఈ రోగములను ఏడు విధములుగా విభాగించియున్నారు. ఎట్లన,

1. అతిబలప్రవర్తితరోగము = వంశపారంపర్యరోగము.

2. జన్మబల ప్రవర్తితరోగము=తలిదండ్రుల సంబంధమైన, లేక పుట్టినది మొదలుగా నుండు రోగము.

3. దోషబలప్రవర్తితరోగము=ఆహార విహారములయందు మార్పులు చెందుటచేత కలుగు రోగము.

4. సంఘాతబలప్రవర్తిత రోగము = హఠాత్తుగా సంభవించు రోగము.

5. కాలబలప్రవర్తితరోగము = శీతకాలము నందును, ఉష్ణకాలమునందును, అనగా ఆయా కాలస్థితికిం దగినట్లు సంభవించురోగము.

6. దైవబలప్రవర్తిత రోగము = విషూచి, స్ఫోటకము, మొదలగు రోగము.

7. స్వభావబలప్రవర్తితరోగము = జ్వరము మొదలగు రోగములు.

---

## వాతరోగ లక్షణము.

సర్వనాళములయందు దోషము కలిగినప్పుడు వాతరోగము సంభవించును. ఏ స్థానమునం దీరోగము కలిగి బాధచేయునో ఆ స్థానమునకుం దగిన పేరును పొందును.

సకల రోగములలోకెల్ల వాతరోగమే మిగుల బాధను కల్గించునదిగను, మనుష్యుని తలక్రిందుగాం జేయునదియును (కొన్నిసమయములయం దిట్లు చేయించుచున్నది), అనేకరోగములకు బీజభూతము నై యున్నది. ఈ వాతరోగ లక్షణము లనేకములుగా గ్రంథములయందు చెప్పఁబడియున్నను, సకల వాతరోగముల యొక్క లక్షణములన్నిటిని క్రోడీకరించి తెలియపఱచఁబడి యుండుటచేత నీ లక్షణములయందే తక్కిన రోగలక్షణము లైక్యమై యున్నవని గ్రహించునది.

ఇట్లే సమస్త రోగ లక్షణముల యందును గ్రహింప వలయును.

## అపతానకవాతము.

కఠినరోగములు కలిగినప్పుడును, రక్తస్రావము సంభవించినప్పుడును, స్త్రీలకు ప్రసవించినతర్వాతను, బాలురకును, ఈ రోగము కలుగును. ఇది సన్నిపాత మనఁబడును. దీనిని అపతంత్రక మని యును జెప్పుదురు.

## ధనుర్వాతము.

ఇది ప్రధాన కండరములకుం గలుగు రోగము. శరీరము విల్లువలె వంగి నరములు బిగువుగా నుండుటచే దీనికీపేరు కల్గెను. ఇది మూఁడు విధములు. 1 శిరస్సు వెనుక వంగియుండిన బాహ్యాయామవాతమనియును, 2 శిరస్సు ముందు వంగియుండిన అంతరాయామ మనియును, ధను స్తంభవాత మనియును, 3 దేహము ఒకవైపుగా వంగియుండిన పక్షవాతమనియును పేరు.

ధనుర్వాతమునే కొందఱు వ్రణసన్నిపాత మనెదరు. పైన చెప్పిన త్రివిధ ధనుర్వాతరోగము లందును, హనుస్తంభ హనుస్రంస రోగములం

నను నోరు తెరువఁబడకను, మ్రింగుటకును, కష్ట
ముగా నుండెను. ఉదరమునందలి నరములు
బిగువుగా లాగఁబట్టుకొని యుండును. అనే
కముగా చెమ్మటపట్టును. అప్పుడప్పుడు నరములు
లాగుచుండును. ఈ రోగము అసాధ్యము.

హనుస్తంభవాతము.

క్రింది దవడకు దెబ్బతగిలి హను క్రిక్కిరించు
కొన్నయెడల హనుస్తంభవాత మనఁబడును.

ఈ హనుస్తంభవాతము శిశువులకుఁ గలిగిన
యెడల మాంద్యరోగమని చెప్పఁబడును.

హనుభ్రంశవాతము.

దవడలు క్రిందికి వాలియుండును. కుడిప్రక్క
వాయువధికముగా చేరియుండిన యెడల ఎడమదవ
డయును, ఎడమప్రక్క వాయువధికముగాఁ జేరి
యుండినయెడల కుడిదవడయును వాలియుండును.
పెదవులను సమముగా జేయ్చుటకును, మాటలాడు
టకును కాదు.

## అర్దిత వాతము.

మెడ కునందుండి ముఖమునకు వచ్చునట్టి నాళ మునకు దోషముకలిగి యీరోగము సంభవిం చును. ఈ రోగము గలవారికి కండ్లు ఱెప్పలు మూయుటకు మిగుల ప్రయాసగా నుండును. దవడచర్మము వ్రేలాడును. నోరు ఒక వైపుగా వంగియుండును. మఱియు మాట్లాడుటకును, నవ్వుటకును, దృష్టిని నిగుడించి చూచుటకును సాధ్యముకాదు. దీనికి అర్ధముఖ వాతమనియును ఆస్యవాతమనియును, ముఖవాతమనియును, ఏకా యామ మనియును నామములు కలవు.

## జిహ్వాస్తంభ వాతము.

నాలుక స్వాధీనముతప్పి మాటలాడుటకు శక్తి లేకుండుట. ఇదియు అర్దిత వాతభేదము.

## పంగువాతము.

నరములు కాళ్లు చేతులు లాగి పట్టుకొని యుండుట. లేక తొడసందులను బిగించిపట్టుకొని

రక్తమును ప్రవహింప జేయకుండుట. ఇట్లాయి నప్పుడు మోకాళ్లకు క్రిందిపార్శ్వమునందు నత్తువ లేక పోవును. నడుచుటకును కాకుండును.

### జంబూకశీర్షవాతము.

మోకాలి లోపలనుండు మూలుగునందు గాని లేక మజ్జయందుగాని శోధించి వాపుకలిగిన నొప్పిగా నుండును. అది నక్కతలవలె నుండును. కనుక దీనికీపేరు కల్గెను. దీనినే క్రోష్టుకశీర్షవాతమని యును జెప్పుదురు. ఈరోగమునందు మోకాళ్లను ముడుచుటకును చాచుటకును కాదు. కొన్ని సమయములయందు నడుచుటకును సాధ్యముకాకుండును. అయినను కొంచెముదూరము మాత్రము నడువ వచ్చును. ఇది సాధ్యరోగము.

### అంగుష్ఠవాతము.

చేతులయొక్కయు, కాళ్లయొక్కయు వ్రేళ్ల సంధులయందు రక్తము చెడి వాపుకలిగి నొప్పిగా నుండును. జ్వరమువచ్చును. దీనికి పుచ్ఛావర్త వాత మనియును పేరు కలదు.

## చలనవాతము.

శరీరమునందలి నరములకు బలము తక్కువ యై చలించుచుండును. ఇది యేయంగము చలించునో దానికి ఆపేరు ఇయ్యబడియున్నది. అనఁగా చేతులు వణఁకుచున్నయెడల హస్తకంపవాతము, కరాక్షేపకవాతము, అవబాహుకవాతము అనియును; తల వణఁకుచుండినయెడల శిరఃకంపవాతము, శిరశ్చలన వాతము అనియును; కాళ్ళు వణఁకుచున్నయెడల పాదాక్షేపక వాతము, పదచలనవాతము అనియును చెప్పఁబడును. ఒక భాగముయొక్క అంగమునందు చలనమున్నయెడల సాధ్యము.

## దండవాతము.

ఈరోగమునందు శరీరమునందుండు నరములు లాగి పట్టుకొనుటవలన వంగుటకును, ఒరుగుటకును సాధ్యపడక వేదన కలిగియుండును. కదలక మెదలక దండమువలె పడియుండుటయు సంభవించు చున్నది.

అండవాతము.

బీజము వాపుకలిగి నొప్పిగానుండును. జ్వరము వచ్చును. వాంతికలుగును. దీనికి అండశోథవాతమని యును, ఆంత్రాపసృతవాతమనియును, బీజవాత మనియును పేళ్లుకలవు. అండమునందు నీరుచేరి యుండుదానిని జలాండమనియును, కండచేరియుం డినదానిని మాంసాండమనియును పేరు. దీనినే బుడ్డయని చెప్పుదురు.

అస్థ్యావృతవాతము.

ఎముకలను మూసికొనియుండు మజ్జ స్థానమందు నపుడు ఈ వ్యాధికల్గును. ఈనొప్పిగలచోట వాపు కలిగియుండును. వేదన, జ్వరము, బలహీనము, అన్నద్వేషము కలుగును.

ఆంత్రభిద్వాతము.

అన్నాశయమునందును ప్రేగులయందును గాలి చేరి యీరోగము సంభవించుచున్నది. పదా ర్థములయొక్క దుష్టత్వముచే కలిగిన గాలిని పీల్చుటవలనను అధికముగా భుజించుటవలనను

ఈరోగము కల్గును. కొందఱికి ప్రేగులయందుండి కల్గును. ప్రేగుల బలముతగ్గినవారికి ఈ రోగము వచ్చును. కడుపు ఉబ్బి భేరివలెనుండును. అపాన వాయువువిశేషముగా వెలువడును. కడుపుమ్రోగు చుండును. మఱియు జలమలనిరోధము నుండును. ఆధ్మానవాతము, అలసకరోగము, ఉష్ణవాయువు, అష్ఠీలవాతరోగము, ఆనాహరోగము, అనునివి యన్నియును ఆంత్రభిద్వాతరోగమునందు చేరినవి.

## అష్ఠీలవాతము.

ఆంత్రభిద్వాత రోగలక్షణములే దీనికినికలదు. అయినను ప్రక్కలయందు వాపుకలిగియుండును.

## శోణితవాతము.

మోకాళ్లు మొదలగు పెద్దపెద్ద కీళ్లయందు చుట్టుకొనియుండు మజ్జకు రక్తదోషముచే కలుగు వ్యాధి. ఇది ఒకచోటనుండి మఱొకచోటికి వ్యాపించును. వ్యాధిగలస్థలమున వాపుకలిగ యెఱ్ఱగా వేడిగానుండును. వేదనయుండును. కదలింప

[illegible]కాకుండును. ఈరోగమువలన జ్వరము వచ్చుటయుకలదు. ప్రమేహరోగుల కీవ్యాధి [illegible] టయుకలదు. దినములైనప్పాలకు [illegible] తగ్గియుం డును. ఈ రోగమును ఊరువాతమనియును, వాత శూలయనియును, సంధిశ్లేష్మమనియును, కీలు వాయు వనియును, సంధివాతమనియును, రసవ [illegible]నియును చెప్పుదురు.

## గ[illegible]వాతము.

కంఠముయొక్క ప్రక్కయందుండు కండవా చుటచే నీ రోగము కల్గును. దీనికి శీతలమే కార ణము. వ్యాధికలిగియుండు భాగమునందే తల వాగియుండును. దీనిని ఇలుకు అనియును, బెణుకు అనియును చెప్పుదురు. కొందఱు దీనిని పుట్టాయి అమ్మవారనిచెప్పి బంగారునగను కంఠ మున ధరింపఁజేసెదరు.

## గృధ్రసివాతము.

తొడకు వెనుక లోపలిభాగము నందుండు పెద్ద నరమునం దీ రోగము కల్గును. ఈ రోగము పిఱు

డులనుండి తొడల వెనుకభాగముగ మోకాళ్ల వఱకు నుండును. కొందఱికి పాదముల వఱకు నుండును. ఒక్కకాలికే తఱుచుగా నీ రోగము వచ్చును. ప్రసవించిన స్త్రీల కీవాతవ్యాధి సంభవించుటయు కలదు. వేదనయు, నడచుటకు సాధ్యముకాకయు నుండును.

## జఘనావర్తవాతము.

నడుమునందుండు నరములకు తాపితము కలిగినందుచే నీరోగము సంభవించును. విశేషముగా నడచుట, గడ్డలు మొదలగు కఠినాహారములను గ్రోలుట మొదలగువానిచే నీవ్యాధి కలుగును. దీనినే నడుమునొప్పి యని చెప్పుదురు.

## ఊరుస్తంభవాతము.

ఇది గృధ్రసివాతమువలెనే బాధకలిగియుండి, తొడలు కదల్చుటకు కాకుండును. వేదన అధికముగా నుండును. దీనికి ఆఢ్యవాతమనియును పేరుకలదు.

### జానుస్తంభవాతము.

మోకాళ్ళయందు నొప్పికలిగి యుండును. కొంచెముసేపు నడిచినను, కొంచెముసేపు కూర్చుండినను తేనెకట్టి యుండును. మఱియు నడిచినపుడు [illegible] నప్పుడును, కూర్చుండినపుడు [illegible] నొప్పియుండును. ఈవాయువు మోకాళ్ళ కీళ్లకు జంబూకీర్ణవాతముగా పరిణమించుచున్నది.

### సూర్యావర్త వాతము.

ఇది శూలరోగములలో నొకభేదము. స్పర్శ నరములకు గలుగురోగము. ఈవ్యాధి నొసలికిని నెత్తికిని ప్రసరించియుండు నరములవలన కలుగుచున్నది. బలహీనముచేత నీరోగము సంభవించుచున్నది. ఇది సూర్యోదయము మొదలుమధ్యాహ్నమువఱకు మిగులవేదనగా నుండి తర్వాత క్రమక్రమముగా మధ్యాహ్నము మొదలు తగ్గిపోవుచున్నది. ఇదే కణతనొప్పి. ఇదియే ఒంటితలనొప్పి.

## చంద్రావర్త వాతము.

సూర్యావర్తవాత రోగలక్షణములే దీనికిని యుండును. ఇది చంద్రోదయము మొదలు అర్థ రాత్రివఱకు వేదన క్రమముగా హెచ్చుచుండు అర్థరాత్రి మొదలు ఉదయములోపల క్రమముగా వేదనతగ్గిపోవును. ఇది ఎడమకణత నొప్పి. ఇదియే ఒంటితలనొప్పి.

## స్తనరుగ్వాతము.

స్త్రీలకు స్తనములయందు వేదనకలిగి యుండును. కొన్ని సమయములయందు స్తనములకు వెనుక భాగమున వీపునందును నొప్పిగానుండును. దీనిని స్తనశూల యనియును జెప్పుదురు.

## పార్శ్వవాతము.

మెదడు చెడుటచేత నీ రోగము కలుగును. కుడిప్రక్క మెదడుకు దోషము సంభవించినపుడు ఎడకాలు ఎడమచేయియును, ఎడమప్రక్క మెదడుకు దోషము సంభవించినపుడు కుడికాలు కుడి చేయియును, స్వాధీనము లేకపోవును. వెన్నెముక

కొన్నిసమయములందియు నీ వ్యాధి సంభవించుట కలదు. దీనినే పక్షాఘాత మనియును, పక్షవాతమనియును, అర్ధాంగవాత మనియును, ఏకాంగవాత మనియును జెప్పుదురు. ఈ రోగమునకు శీతలమును బలహీనమును ముఖ్య కారణములు. శీతళలకు నుండడముచే నీ రోగము కల్గును.

హృద్వాతము.

ఈ రోగము ముసల పురుషులకు కలుగును. అప్పుడప్పుడు వచ్చును. హృదయము యొక్క బలముతగ్గినపుడును, వయస్సధికమైనవారికిని యీ రోగము సంభవించును. ఎడమవైపు గుండెకాయయందు చోటుకుండ మిగుల నొప్పిగానుండును. శ్వాసబంధము కలుగును. ప్రాణోత్క్రమణ సమయమునందెట్లుగా భయముండునో అట్లుండును. మఱియు నాడి మందముగా నుండును. శ్లేష్మలక్షణము కనబడును. ఈ రోగము కొంచెము సేపుండి నిమ్మళించును. అట్లు నిమ్మళించక పోయినయెడల తప్పక మరణముకలుగును. కొన్ని

సమాగమములయందు అజీర్ణమువలనను ఇట్టి సంభ
వించుటకలదు. అజీర్ణముచే సంభవించిన రోగ
మునందు ప్రాణాపాయము సంభవించదు. దీనిని
హృదావృతవాత మనియును, హృద్రోగమని
యును, రొమ్మ్రణపు అనియును, గుండెనొప్పి యని
యును చెప్పుదురు.

## తునివాతము.

పొత్తికడుపు, గుదము, గుహ్యము, పిఱుం
దులు, ఈ స్థానముల యందుగాని వీని సమీప
స్థలములయందుగాని వాతము నిలిచియుండి వేద
నను కలుగఁజేయును.

## సన్న్యాసవాతము.

ఈ రోగము తఱుచుగా స్త్రీలకే వచ్చును.
చూచుటకు భయంకరముగ నుండును. అయినను
అపాయము కలుగదు. ఈ రోగమును తెలియక
కొందఱు జీవముతోనే శరీరమును పాతిపెట్టె
దరు. కొందఱు దహనముచేసెదరు. ఈ రోగము

నందు అంగచలనమును, ప్రజ్ఞయును ఉండదు. రోగము ఆవరించుటకు ముందు శరీర మెట్లుండెనో ఆ విధ ముగనే కదలక మెదలక యుండును. శరీరము బిగువుగా నుండును. ఇది కొన్ని నిమిషములు, లేక కొన్నిగడియలు, లేక 1-2 దినములు ఒకే విధముగానుండును. ఈ రోగి, రోగము శమనమైన పిదప నిద్రపోయి లేచినట్లుగా లేచును. చికిత్సాసు లేవియు రోగికి తెలియవు. దీనికి సూతికాసన్ని పాత చికిత్సయే చేయవలసినది. ఈ రోగమును మదమూర్ఛయనియు, బుద్ధిభ్రంశమనియు, మహా త్యయమనియు, అపస్మారమనియు, మూర్ఛయని యు, మోహమనియు, చెప్పుదురు.

## అపస్మారము.

ఇది మెదడు ననుసరించిన వ్యాధి. కీచుమని యఱచుచుగాని, ఊరకగాని ఉన్నట్లుండి తటా లున నేలపై పడిపోయి కాళ్లుచేతులను విదిర్చుచుం దురు. నోటియందుండి చొంగ కారుచుండును. కంఠము మూతబడును. వ్రేళ్లు ముడుచుకొనును. సంజ్ఞ

క్రిక్కిరిసి నోరుతెరవక పడియుండును. ప్రాణా
పాయ స్థితిలోనుండు వారివలె కనఁబడుదురు.
ఈరోగము బాలురకు విశేషముగ వచ్చుచున్నది.
పెద్దలలో కొందఱికే వచ్చుచున్నది. తఱుచుగా
శీతలకాలమునం దీ రోగము గలవారికి అప్పు
డప్పుడు వచ్చును. దీనికే కాకిసోమాలయని
కొందఱందురు. ఇదియు సన్యాస వాతరోగమునం
దు చేరినదని తెలియఁదగినది.

## సన్నిపాతము.

ఈసన్నిపాత రోగములు పలువిధములు. ఇవి
యన్నియు అపతానకాది వాతరోగభేదములు. ఈ
వ్యాధి పెద్దలకును, బాలురకును, ప్రసవస్త్రీలకును
కలుగును. ఈరోగము కలుగుటకు ముఖ్యకారణ
మేమనఁగా, దేహమందలి నరములు హఠాత్తుగా
లాఁగుకొనుటయేగాని వేరుకాదు. మరియు ఇతర
వ్యాధులు కలిగినపుడు ఆవ్యాధులు నివర్తికాక
దోషించినపుడును, మెదడుయొక్క స్థితియును,
మెదడు నరములయొక్క స్థితియును చెడినప్పు

డును కలుగును. ఈరోగమునందు శరీరమునకు స్ఫూర్తి యుండదు. మిగుల బాధగా నుండును. కొంచెము సేపు బాధలేకుండుటయును గలదు.

## అగ్నిమాంద్యము.

భుజించిన అన్నము జీర్ణముకాకుండును. ఆకలి మందముగా నుండును. గుండెలయందు నొప్పి కలుగును. కడుపుడుబ్బును. పుల్లత్రేపులు వచ్చును. పిత్తనీరు వాంతియగును. అపానవాయువు వెలువడుచుండును. దీనికి మందాగ్నియనియును, పిత్త వాయువు అనియును, అజీర్ణరోగమనియును పేర్లు కలవు.

## అతిసారము.

మలాశయములోని పెద్దప్రేగు లోపలనుండు శ్లేష్మమునకు తాపితమును వ్రణమును కలిగినయెడల అతిసారరోగము సంభవించును. భోజనము నందు కాలమును పాటింపక భుజించువారికిని, అప్పుడప్పుడు దొరకినదానిని తినువారికిని, యీరో

గము కలుగును. రక్తమును మలమును కలిసి బద్ధకోష్ఠముగా ప్రవృత్తియగును. మలము ఎండినట్లుండును. కడుపు నొప్పిగా నుండును. జ్వరముసుండును. ఆకలి మందముగా నుండును. ఇది అనేక రోగములను, కలిగించునట్టి వ్యాధిగా నున్నది. బంకమాత్రము పడినయెడల ఆమాతిసారమనియును, ఆమభేది యనియు, శీతభేది యనియును జెప్పుదురు. బంకయు నెత్తురుకలిసి పడినయెడల ఆమరక్తాతి సారమనియును, ఆమరక్తభేదియనియును, శీతరక్తభేదియనియును, నెత్తురుబంక యనియును జెప్పఁబడును.

1. ఎఱ్ఱగను నురుగుగను ఉష్ణముగను మాటిమాటికి ఆమముతోఁ గూడినదిగను, కడుపుత్రిప్పినట్లుగను, శబ్దముతోడను భేదియగునేని అది వాతాతిసారమనఁబడును.

2. రక్తముతోఁగూడి మలము దుర్గంధముగను, నల్లగను, లేక పసుపుగను వెడలినయెడల పిత్తాతిసారమనఁబడును. దీనియందు ఒళ్లుమంటలును,

మంటయును, దాహమును, శోకమును కలిగి యుండును.

3. శీతముతోడను, ఉదరవేదనతోడను, మల వినలాడుచును, గుజ్జుగను భేదియగునేని శ్లేష్మాతిసారమనఁబడును.

### అర్శోరోగము.

ఈరోగము విశేష ఉష్ణముచేతను, అతి సంచారాది వ్యాపారములచేతను సంభవించుచున్నది. గుదస్థానము నందుండు రక్తనాళము వ్యాధియై, తద్ద్వారా మొలకలుపుట్టుటకు అర్శస్సు అని నామము. దీనికి మూలరోగమనియును, దుర్నామమనియును పేరుకలవు. ఇది పలువిధములుగా నున్నవి.

రక్తమూలము—మలముతో నెత్తురు పడుట.

ఆర్ద్రమూలము — జిగటగా చీమువలె నీరు స్రవించుచుండుట.

శుష్కమూలము — ఆసనద్వారము ఎండై యుండుట.

సహజమూలము — బాల్యమునుండి అడుగు జారియుండుట.

ఉత్తరజమూలము—వయస్సు వచ్చినమీఁద మూలవ్యాధి కలుగుట.

అంతరమూలము—లోపలనే గుదము బుడిపి కట్టుకొని యుండుట.

బాహ్యమూలము—వెలుపల గుదము బుడిపి కట్టుకొని యుండుట.

గుదకీలము — ఆసనమూలమునందు మొలకలు కలిగియుండుట.

వాతజమూలము—ఆమముతోఁగూడి మలము వెడలునప్పుడు నొప్పికలిగియుండుట.

శ్లేష్మజమూలము — మలము తెల్లగా స్రవించుట.

రక్తమూలకమును రక్తజమూలమనియును, పిత్తజమూలమనియును; గుదకీలమును గుదాంకురమనియును, అర్శస్సనియును; బాహ్యమూలమును గుదభ్రంశమనియును జెప్పుదురు.

మూలవ్యాధియందు ఉష్ణము అధికమగునపుడు నొప్పియును, పోటును, మంటయును, [illegible]యును, గలిగించుచుండును.

## అసృగ్దరరోగము.

ఇది స్త్రీలకు గలుగురోగము. ధాతువులు క్షీణమైనపుడు గర్భస్థానమందుండు ధాతువులు బలక్షీణమునొందును. అపుడు గర్భకోశమునందుండి రక్తము అధికముగా స్రవించుచుండును. ఇట్లు బహిష్టయైనపుడు కొన్నాళ్లవఱకు నుండుటయు కలదు. రక్తము స్రవించునేని రక్తస్రావమనియును, దుర్గంధముతోగూడి స్రవించునేని అస్థిస్రావమనియును చెప్పఁబడును. ఈరోగమునకు ప్రదరరోగమనియును పేరుకలదు.

## జల కూర్మము.

ఇది స్త్రీలకు యోన్యాశయము వికటించి దినక్రమమున వృద్ధియగును. ఇందువలన పొత్తికడుపు తాఁబేలువలె పెద్దదియగుచు వచ్చును. దీనికి ప్లీహ రోగమునకు చేయుచికిత్సయే చేయవలయును.

## నిద్రాభంగము.

మెదడునందు రక్తవ్యాపారము వికల్పమగుటచే నిద్రకు భంగము కల్గుచున్నది. మఱికొన్ని కారణములచేతను నిద్రాభంగమగుటకలదు. అవి యేవన, నిద్రాసమయమునందు విశేషధ్వని చెవులంబడుచుండుట, చింత, ఆఁకలి, విరేచనము, నస్యము, రక్తమోక్షణము, భయము, కోపము, సౌఖ్యము లేనిపడక, మైథునము, సంతోషము, సత్వగుణాధిక్యత, తమోగుణజయము, రూక్షాన్నభోజనము ఇత్యాదులు. వీనియందు మెదడునందలి రక్తవ్యాపార వికల్పముమాత్రము ఔషధ

ముచే శమించును. తక్కినవి వానిపరిణామాంత మున శమియించును. కనుక, ఔషధమక్కఱలేదు.

## అరోచకము.

రోగములు సంభవించి నపుడు నాలుకయం దుండు నరముయొక్క స్వభావస్థితి చెడిపోవుట వలన నిది కలుగును. పిత్తాధిక్యముచేత కూడ అరోచకము కలుగుటకలదు. దీనికి అన్నద్వేషమనియు ను, అరుచియనియును పేర్లుకలవు.

## జ్వరము.

జ్వరము మేధో దోషముచేతను, మందము చేతను, అజీర్ణము చేతను, వ్రణము చేతను, గాయము చేతను, భయముచేతను, ఇతరరోగ విపరీతముల చేతను కల్గుచున్నది. జ్వరము జన్మము నందుండియే కలిగినది. కొందఱు దీనికి పలువిధములైన కారణములను చెప్పుచున్నారు. ఏదియు నిశ్చయము నుటకు దృష్టాంతములేదు. కొన్ని సమయముల యందు విషవాయువుచేతను, ఉష్ణశీతలవిపరీతము

చేతను కూడ కల్గుచున్నది. ఈరోగమువంమ సప్త ధాతువ్రలకును బలముచెడి మిగుల ఆయాస మును కలిగించుచున్నది. ఈజ్వరరోగము శీఘ్ర కాలమున నివృత్తించుటయుకలదు. అధికదినము లుండుటయును కలదు. ఒకదినమువిడిచి మఱు దినము వచ్చుటయును కలదు. కాల నియమము లేకవచ్చుటయును కలదు. మఱియు అనేకరోగ ముల యందు జ్వరము అనుసరించియే యుండును. అట్టి సమయములందు జ్వరమునకు గారణంబైన ప్రధాన రోగమును శమింపఁజేసిన మొదల జ్వర ము తనంతట నిల్చిపోవును. సాధారణముగా జ్వరరోగములందు ఒళ్లునొప్పులు, అన్నద్వేషము, అతిదాహము, పెదవులెండుట, అరోచకము, ఆ యాసము, వాంతి, ఓకరింత, తలనొప్పి, మైకము, ప్రలాపము, మోకాళ్లుమొదలగు కీళ్లునొప్పులు, చలి, నిద్రలేమి, ఇవి యుండును. జ్వరభేద ముచే నీ లక్షణములలోఁగొన్ని లేకుండుటయును గలదు.

ఈ జ్వరరోగములను గూర్చి శాస్త్రముల యందు విస్తరించి వ్రాసియున్నారు. సామాన్యముగా నిదానమునచే తెలిసికొనుటకు సాధ్యమగు నట్లు జ్వరరోగలక్షణములను విభాగించి తెలుపఁ బడును.

## శీతలజ్వరము.

ఈ జ్వరమునందు తఱచుగా దినమునకొకయం పంకి మొదట చలి కలుగును. తర్వాత ఉష్ణము కల్గి చెమటఁబుట్టును. ఇది ఆహ్నిక జ్వరముతోఁ సంబంధించినది. ఒకటి రెండుదినములు జ్వరము లేకుండి మఱలవచ్చును. దీనికి చలిజ్వరము, వంతు జ్వరము, ఏకాంతజ్వరము, నాడిజ్వరము, కంపజ్వ రము అని పేళ్లుకలవు.

## శమనప్రకోపజ్వరము.

ఈ జ్వరమునందును శీతలజ్వర లక్షణములే కొన్ని కలిగియుండును. అయినను అప్పుడప్పుడు చెమట బుట్టును. జ్వరము అపుడపుడు తగ్గుచును హెచ్చు

చును నుండును. శీతలజ్వరమునందు పలె బొత్తి
గా జ్వరము తగ్గియుండదు.

## వాతజ్వరము.

ఇది వాతప్రకృతి శరీరము కలవానికి గల్గునేని
వాతజ్వర మనఁబడును. ఈ వాతజ్వరము నందు
తలనొప్పి, మోకాళ్లునొప్పులు అధికముగా నుం
డును.

## పి_త్తజ్వరము.

పి_త్తప్రకృతి గలవానికి కల్గుజ్వరము పి_త్తజ్వర
మనఁబడును. ఈరోగమునందు తాపము, దా
హము, ప్రలాపము (వదరుట), అధికముగానుం
డును.

## శ్లేష్మజ్వరము.

శ్లేష్మ ప్రకృతిగలవానికి వచ్చునట్టి జ్వరము శ్లేష్మ
జ్వర మనఁబడును. దీనియందు పొడిదగ్గు కల్గి
యుండును.

## తాపజ్వరము.

జ్వరము విడువక మిగుల వేడిమిగా నుండిన యెడల తాపజ్వర మనఁబడును. ఇందు సాయం కాలమునయందు బాధ విశేషముగా నుండును. దీనిని తీక్ష్ణజ్వరమనియును జెప్పుట కలదు.

ఈ వాత, పిత్త, శ్లేష్మ తాపజ్వరములు, 1 మొదలు 10 దినములలోపల నివృత్తించును. బలహీనులకు మఱికొన్ని దినములు పీడించును. ఇంతకంటె ఎక్కువ దినములు పీడించునేని అది అపథ్యదోషముచేత కలిగినదనియే నిశ్చయముగాఁ జెప్పవలయును.

## సన్నిపాతజ్వరము.

ఈ జ్వరము సుమారు 15 దినములు మొదలు కొలదినములవఱకు బాధించును. ఇది విషవాయువు చేఁ గల్గును. నరములయందలి బలముతగ్గియుం డును. కావున మిగుల అశక్తియును, ఆయాస మును, వికారమును కల్గును. ఈ జ్వరమునందు

శరీరమున దోమకాటువంటి దద్దులుండును. దీనికి దోషజ్వరమనియు, విషజ్వరమనియు పేర్లు కలవు.

### అతిసారసన్నిపాతజ్వరము.

ఈజ్వరమునందును సన్నిపాతజ్వరలక్షణములే యుండును. అయినను భేదియగుచుండును. కొన్ని సమయములయందు రక్తభేదియగుటయును గలదు. ఇది ఒకనెల పీడించును.

### అంతర్గతజ్వరము.

కొన్నిసమయములయం దేదేని రోగములు కలిగి, అవి నివర్తి కాకపోయినపుడు, ఆ రోగశేషముచేత జ్వరమువచ్చును. దీనికి ప్రథమరోగము శమనమగునట్లు ఔషధ మీయవలయును. ఈ జ్వరము శరీరములోపలనే కాగుచుండును. అధిక దాహము, భ్రమ, ఎముకల సంధులయందు నొప్పి, మలబంధము, ప్రలాపము, ఇవి కలిగియుండును. దీనికి అస్థిగతజ్వర మనియును పేరుకలదు.

## గుల్మరోగము.

ఈరోగమునందు సాధారణముగా కడుపు నొప్పి, అజీర్ణము, పుల్లత్రేనుపులు, శూల, ఇవి యుండును.

## రక్తగుల్మము.

స్త్రీలకు క్రమముగా బహిష్ఠ యగునప్పుడు రజస్సునిలిచినందుచే పొత్తికడుపు గట్టిగానుండును. జఠరశక్తితగ్గి యుండును. మలబంధముగనుండును. ఇది సూతికాశూలయందొక భేదము.

## ఛర్దిగుల్మము.

ఇదిగుల్మరోగభేదము. కొందఱు దీనిని ప్రత్యేకరోగమనిచెప్పుదురు. దీనియందు జఠరకోశము చెడియుండును. ఆహారము మీఁదుగనే నిలిచియుండును. అందుచే వాంతియగును. దీనికి వమనరోగమనియును, వాంతిరోగమనియును, ఛర్దిరోగమనియును నామములుకలవు. కొందఱికి దృష్టిదోషముచేత నీలాగు కలుగుచున్నదనెదరు. అందు

వలన దృష్టాన్న వమనరోగమనియును దీనికొకపేరు కలిగయున్నది.

## ప్లీహాగుల్మము.

శీతజ్వరము కలవారికి కడుపుయొక్క ఎడమ పార్శ్వమునందుండు ప్లీహమనెడి స్థానము వృద్ధి యగును. తాకిచూచినయెడల గడ్డవలెకనఁబడును. నొప్పియుండదు. ఈరోగమునందు క్రమముగా అన్నద్వేషము కలిగి శరీరమునందు రక్తవృద్ధిని తక్కువ పఱచును. దీనిని బల్లయనియు, ప్లీహాశోథ యనియు, జ్వరగడ్డ యనియు, ప్లీహోదరమని యుఁ జెప్పుదురు.

## యకృతోదరము.

కడుపుయొక్క కుడిప్రక్కగుండెకాయ యకృత్తనఁబడును. చెడిన రక్తము మీఁదికిపోవునపుడు అందలి దోషమును యకృత్తు గ్రహించును. ఇదే పిత్తజలము. ఈజలము రక్తమునందే చేరిపోయినయెడల శరీరము పసుపువన్నె గల్గియుండును.

దీనియందును అజీర్ణము కల్గును. ఇది వృద్ధియగు నేని ఒడలువాపెక్కును. దీనిని పసుపుకామిలా రోగమనియు చెప్పుదురు.

మహోదరము.

ఉదరమందలి మజ్జాధాతువులలో జలమధికముగా జేరుటచే నీరోగము కల్గుచున్నది. మరియు యకృద్రోగము, ప్లీహారోగము, హృద్రోగము, (ఇదేహృద్వ్యాతము) మొదలగు రోగములు వృద్ధినైనయెడల ఈరోగము సంభవించును. దీనియందు కడుపు మినమిన లాడుచునుండును. నరములు ఉబికి యుండును. వ్రేళ్లతో తట్టినయెడల డక్కు గట్టును. ముఖము వివర్ణమైయుండును. శోభగా నుండును. కాళ్లు చేతులు వాచియుండును. అది మినయెడల పల్లముపడును. మూత్రము తక్కువగా స్రవించును. దీనికి జలోదరమనియును, జలస్తంబోదరమనియును పేరు కలదు.

## శోఫ.

శరీరమునందు రక్తమునకు దోషముకల్గఁగ అది నీరై ఆనీరుచేత వాచియుండినయెడల శోఫరోగమ నఁబడును. దీనియందు రక్తక్షీణము కల్గియుండును. శరీరమాద్యంతమును వాచియుండినయెడల నిజశోఫరోగమనియును, పాండురోగమనియును, విషపాండు వనియును; వృషణములలో నీరుచేత వాచియుండిన యెడల జలాండ మనియును; కడుపు నందునీరుచేత యుండినయెడల జలోదరమనియును, మహోదర మనియును; విషజంతువు శరీరముపై పాకి వాచినయెడల విషశోఫ యనియును; ఒకచోటనుండిన వాపు మఱొకచోటికి వ్యాపించిన యెడల ఆగంతుకశోఫ యనియును, స్థావర విషములచేతను ధాతుజ విషములచేతను వాపుకలిగిన యెడల అభిఘాతశోఫ యనియును జెప్పఁబడును.

## శూల.

అనేకవ్యాధులు శూలవ్యాధియందు చేరియున్నవి. శూల యనఁగా శూలము అనెడి యాయుధ

ము చేత పొడిచినట్లు నొప్పిగానుండుట. ఇది శరీర
ము సందెచ్చోటనైనను నరములతో సంబంధించి
వేదనను చేయును. కడుపునొప్పిని గుల్మశూల
యనియును, సంధ్లనొప్పిని జంతిశూల యనియును,
చంకల నొప్పిని కక్షశూల యనియును, చేతుల
నొప్పిని బాహుశూల యనియును, గర్భస్త్రీల
కడుపునొప్పిని గర్భాశయ శూలయనియును, ప్రసో
దర్నసకాలమునందు గల్గునొప్పిని సూతికాశూల
యనియును, తలనొప్పిని శిరోవాతశూలయని
యును, ఇట్లు పలువిధములుగా వ్యవహరింపఁ బ
డును. శూలరోగమునకు బీజము వాతవ్యాధిగా
నున్నది. సకల శూలవ్యాధులును, సకల ఉదరరోగ
ములును వాతవ్యాధితో సంబంధించినవిగా భా
వింప వలయును.

## దాహరోగము.

ఈరోగము నరములయొక్క వ్యత్యాసముచేఁ
గల్గుచున్నది. కాళ్లు మంటలుగానుండిన పాదదా
హమనియును, చేతులుమంటలుగా నున్నయెడ

హస్త దాహమనియును, శరీరమాద్యంతమును మంటలుగానున్నచో సర్వాంగదాహమనియును చెప్పుదురు. ఇది వాతరోగమునందొక భేదము. దీనికి దాహవాతరోగమనియు పేరుకలదు. ఈ రోగము స్త్రీలలో కొందఱికి ప్రసవకాలమునందు కలిగి మిగుల వేదనను కలుగఁజేయుచున్నది. తఱుచుగా కాళ్లుచేతులయందుమాత్రము మంటలుండుటచే కరపాదసన్నియని చెప్పెదరు. సన్నిపాతము వాతరోగభేదమగుటచేత దీనిని కరపాదసన్నియని చెప్పనొప్పును.

## తృష్ణ.

జ్వరము, మధుమూత్రము, వాంతిభేది, మొదలగు రోగములయందు విశేషముగా దాహముకలుగును. సాధారణముగా అందఱికిని యెండకాలమునందు దప్పికలుగును. దప్పిమాత్రము అణఁచరాదు. ఇదే నీరువట్టు. దీనిని కూడ దాహరోగమని చెప్పవచ్చును.

## తాపితము.

రక్తాధిక్యముచేత దేహమునందు ఎచ్చోటనైనను నొప్పి, ఉష్ణము, ఎఱుపు, వాపు, ఇవి యుండినయెడల తాపిత మనఁబడును. దీనియందు జ్వరముండును. శరీరములోపలి అవయవములకు తాపనము కల్గియుండినయెడల జ్వరమును, వేదనయు నుండును. ఈతాపనము విషవస్తువుల యొక్క పోకడుచేత కలుగుటయును కలదు. తత్కాలమునందీరోగమును కొందఱు భ్రమచేత "మహామారి" (ప్లేగు) రోగ మనెదరు.

## వమన రోగము.

దీనికి ఛర్ది యనియు, వాంతియనియు, ఛర్దిగుల్మమనియు, దృష్టిదోషమనియు పలువిధములైన పేర్లుకలవు. వమనము జీర్ణాశయ దోషముచేతనే తఱుచుగాఁ గల్గును. కడుపునందు క్రిములుండినను వాంతికలుగును. క్రిములుండి వాంతియైన యెడల క్రిమివాంతి రోగమనియును, పుల్లగా వాంతియైన యెడల ఆమ్లపిత్తమనియును, తేనుపులుం గలిగి

వాంతియైన యెడల ఉద్గారవమన మనియును జెప్పుదురు. కొందఱికి సహజముగనే అప్పుడప్పుడు వాంతియగుచుండును. ఇట్లగుట అన్నాశయము చెడినందు చేతనే కల్గునని తెలియవలయును. అన్నాశయ దోషముచే కల్గిన వమనము అసాధ్యము. ఈరోగమునందు అన్నము అఱుగదు. భుజించిన వస్తువు లట్లనే వాంతియై పోవును.

## పిత్త రోగము.

ఇది పిత్తాధిక్యముచేత కల్గును. ఉన్నట్లుండి నేలపై పడుటయు, తల తిరిగి సోలిపడుటయు, లేచి నిల్చినపుడు నిల్చుటకు సాధ్యముగాక గిఱ్ఱుమని తిరిగి నట్లుండుటయు, కూర్చుండినపుడు తాను జూచినదంతయు తిరుగునట్లుగా కనఁబడుటయు నీరోగము నందుండును. తటాలున కండ్లు మూసి కొన్నయెడల మైకముతగ్గును. ఈరోగము పిత్తాధిక్యముచేతనేగాక రక్తక్షీణము, మేదోదోషము,

## ఉద్గారము.

ఇది భుజించునపుడును, జీర్ణసమయమునను కలు
గుచున్నట్టి త్రేనుపు. ఇది శుద్ధవాయువు. ఈ త్రేనుపు
ఆరోగ్యస్థితిని తెలియఁజేయునట్టిదిగా నున్నది.

## విషూచి.

వాంతిభేది వ్యాధియొక్క విషము (Cholerine)
చర్మముయొక్క మార్గముగనో, లేక శ్వాసకో
శముయొక్క మార్గముగనో, లేక ప్రేగుయొక్క
మార్గముగనో ప్రవేశించి రక్తముతో చేరుచున్నది.
లోపలికిపోయిన విధ మిట్టిదని చెప్పుటకు సాధ్యము
కాకున్నది. శ్వాసమార్గమున లోపలికి బోవు
చున్నదని తఱుచుగా నమ్మవచ్చును.

ఇందు కలుగు వాంతియును భేదియును ఒక
విధమైన గంజినీళ్లవలె నుండును. కాళ్లయందును,
కడుపునందును కండలు నొప్పికలిగి బిగువగును.
మూత్రము శుద్ధముగా స్రవించదు. దాహమధిక
ముగా నగును. నాడిగతియును శ్వాసగతి
యును తగ్గి ఎక్కిలి నిస్సత్తువకలిగి, శరీరము

నాలుక శ్వాసము ఇవి చల్లనగును. వ్రేళ్లుముడతలు పడును. పెదవులును శరీరమును నీలవర్ణమగును. కంఠధ్వని హీనమగును. ముఖమును దేహమును వాడిపోవును. శరీరఉష్ణముతగ్గినను రోగికి కప్పుకొనుటయుం దప్పియుండును. కన్నులు గుంటలుపడును. ఆమీఁద సంభవించునదేమనఁగా:— శ్వాసము తగ్గును. నాడీకొట్టుకొనుట తెలియదు. తొడకు రక్తవేగము నిలిచిపోవును. అంతటికిని ప్రాణముపోవు వఱకు బుద్ధి స్వాధీనముగానే యుండును. రోగికి ఒక్కసమయము జీవింతుమనెడి నిశ్చయమును, ఒకసమయము జీవింపమనెడి అపనమ్మకమును కలుగును. ఇందు సాధారణముగా 3-18 ఘంటలలోపల మరణము సంభవించును. దీనికి పైబడినయెడల సుగుణము కలుగుటకు అవకాశముకలదు. బహుశీఘ్రమునకొందఱికి దేహముస్వస్థమగును. ఒక్కొకసమయమున కొంచెము సుగుణము కనఁబడినప్పటికిని మూత్రము శుద్ధముగా దిగక ఆమూత్రము రక్తముననిలిచి విషమించి రోగియొక్క ప్రాణము

తీయును. కంపు నిద్ర, తలనొప్పి, దప్పి, వాంతి, గొంతులో కఫము, శోకము, ఇవియుండును. కొందరకు స్వల్ప జ్వరముకలిగి తర్వాతశమనమై శీఘ్రమున దేహము సౌఖ్యమగును. కొందఱకి జ్వరము అతిక్రమించి అధికక్షీణము కలిగినను మంచిచికిత్స వలన సౌఖ్యము కలుగును. ఒక్కొక సమయమున మొదట భేదికనుపించి తర్వాత ఈరోగము కల్గును. ఆయనను నిర్నిమిత్తముగా కలుగుట వాడుకయై యున్నది. మలమును పరీక్షించిచూచినయెడల నీరును, లవణములును, నల్లఉప్పును అధికముగా నుండును.

## అసాధ్య విషూచి.

శూల, అధికముగా భేది, వాంతి, కడుపుఉబ్బరము, దాహము, తాపము, నాలుక పండ్లు గోళ్లు పెదవులు ఇవి నల్లబడుట, చూపుతప్పుట, వణుకు, చెవులువినబడకుండుట, జ్ఞాపకములేకుండుట, అవయవములు పోలిపడియుండుట, అను నీగుణములుండిన యెడల మృతిని కలుగఁజేయును.

## రక్తపిత్తము.

ఇది విశేషఉష్ణముచేతనే కల్గును. మరియు రక్తము అధికమై శరీరమునందలి ద్వారముల యందుండి స్రవించును. ఇది అనేకవిధములు. ఆయా స్థానములనుబట్టి దీనికి పేర్లు పెట్టఁబడియున్నవి.

1. పుప్పుసమునుండి రక్తము వాంతియైన యెడల రక్తకాస మనఁబడును.

2. అన్నాశయమునందుండి రక్తము వమనమైనయెడల రక్తవమన మని చెప్పఁబడును.

3. మూత్రాశయమునందుండి మూత్రముతో రక్తము స్రవించిన రక్తమూత్ర మనఁబడును.

4. గుదమునుండి రక్తము స్రవించినయెడల రక్తమూల మని చెప్పఁబడును.

5. ప్రేగులయందుండి వచ్చినయెడల రక్తవిరేచన మని చెప్పుదురు.

6. ముక్కునందుండి రక్తము వచ్చిన యెడల రక్తపీనస మనఁబడును.

7. నోటియందుండి నెత్తురు వెడలిన యెడల రక్తాస్యమని చెప్పఁబడును.

8. గర్భాశయమునందుండి స్త్రీలకు రక్తము వచ్చినయెడల రక్తస్రావమనఁ బడును.

ఇతరావయవముల యందు అనఁగా కంఠ, చెవులు, రోమద్వారములు వీనియందు విపరీత సమయమునను విషదష్టకాలమునను మాత్రము రక్తము స్రవించును.

## రక్తకాసము.

ఇది పుపుసమనందుండి రక్తము నోటితో వెలువడును. దీనిని క్షయరోగమును సూచించునట్టి ప్రథమచిహ్నమని తెలిసి శీఘ్రమున చికిత్స చేయవలయును.

## క్షయము.

ఈపేరుచేతనే ఇది శరీరమును క్షీణముచేయుచున్నదని యర్థమగుచున్నది. పుపుసమునందు దోషముకల్గి యీవ్యాధిని కల్గించుచున్నది. ఈ

రోగమునందు దగ్గు, గొంతుకక్షుట, దగ్గినపుడు కఫము వెలువడుట, అజీర్ణము, వెన్నునొప్పి, శరీరమునందువేదన, జ్వరము, ఆయాసము, చెమట పట్టుట, భేది, పైడొక్కనొప్పి, ఊపిరిపట్టు, అరోచకము, దుర్బలము, ఇవియన్నియు నుండును. దీనికి రాజయక్ష్మ యనియును పేరుకలదు.

కాసము.

దీనికి కఫరోగమనియును, దగ్గుఅనియును పేరు కలదు. బిడ్డలకు ఈరోగము మందముచేత కలుగుచున్నది. శ్వాస కోశముయొక్క ఇరుపార్శ్వముల యందుండు నరములతో సంబంధించియుండు శ్లేష్మ మజ్జకు వాపుకలిగినయెడల యీరోగము కలును. కొందఱికి జ్వరముతోగూడ ఈరోగము కల్గును. అనేకులకు ఇది మరణపర్యంత ముండును. ఈ రోగమునందు దగ్గు, కష్టశ్వాసము, జ్వరము, కళ్లె (కఫము) పడుట, శ్వాసబాధము, గొంతునందు గళగళశబ్దము, ఆయాసము, తీవ్రనాడి, ఇవియుండును. ఇది దినములైన కొలది బలహీనమును,

మగుల వేదనయును, అతిక్రమమును, ఊర్ధ్వశ్వాసమును, కాళ్లుచేతులయందు వాపును, మాటలు తెగిపోవుటయు నుండును. పచ్చక పొందకుండును. ఇట్టి రోగము కృచ్ఛ్రసాధ్యమని తెలియవలయును.

ఈ కాసరోగము బిడ్డలకు కల్గినయెడల పక్క యెగురవేయుటయు సంభవించును బిడ్డల కిది తఱచుగా మృతిని కల్గించుచున్నది.

## శునక కాసము.

ఇది బిడ్డలకు గల్గునట్టి సోకుడువ్యాధి. ఒక తూరికంటె యెక్కువగా రాదు. దగ్గు విశేషముగా నుండును. చొంగ కారును. రాత్రియందు విశేషముగా దగ్గువచ్చును. దగ్గు ఆరంభమైనమీద ఊపిరైన ఆడుటకు సాధ్యముకానీక దగ్గుమీద దగ్గువచ్చి మిగుల హింస కలుగఁజేయును. ఈ రోగము 3-4 నెలలుండుటయును కలదు. కొందఱికి శీఘ్రముగా నివర్తించుటయు కలదు. ఊన ముత్రైనకాలదిని అసాధ్యముగా నుండును. దీనినే

మనియును జెప్పుదురు. క్షయరోగులకిది సంభవించును. తఱచుగా మాటలాడినప్పుడును, శీతలము చేతను గొంతుకప్పిన యెడల శీఘ్రముగ నివృత్తి యగును.

### హిక్క.

ఇది ఉచ్ఛ్వాసము నందలి యొకవిధమైన భేదము. జ్వరము నందును, ఆయాసమునందును ఇది కల్గును. కొందఱికి కష్టసాధ్య రోగసమయమున కల్గుటయు కలదు. అనేకులకు మరణకాలమునందు ఎక్కిళ్లు కలుటయు కలదు. ఈరోగభేదము లనేకములు. అన్నిటియందును లక్షణ మొక్కటే. కొంచు కొంచుగావచ్చునట్టి ఎక్కిళ్లు యమళ మనఁబడును. హిక్కారోగమును హిధ్మారోగ మనియును, ఎక్కిళ్లనియును జెప్పుదురు.

### మల బంధము.

ఈ రోగము వారివారి శరీరస్థితికిఁ దగినట్లు కల్గును. కొందఱు వాడుకకు విరోధముగా బంధించినప్పుడే మలబంధము కల్గినదని తలంచెదరు.

జీర్ణశక్తి తగ్గుటచేతనే యిది కల్గును. వాతరోగులకు స్వాభావికముగా మలబంధముండును. దీనినే మల వాతరోగమనియును, విలంబికారోగమనియును, మలావృతవాతమనియును జెప్పుదురు.

## ఉదావర్తము.

ఇందు ఊపిరి వెడలకయు, క్రిందు పట్టియు, జలమల విసర్జనము కాకయుండును. దీనినే ఇదువాయుగట్టు రోగమనియును జెప్పుదురు. ఈ ఉదావర్తవాతరోగము మూలరోగము కలవారికే తఱచుగా వచ్చును.

## పీనసము.

ఈరోగము పలువిధములు. సాధారణముగా ఉష్ణాధిక్యముచేత శీతలము కలిసినను, వానలోందడిసినను, పడిసెము పట్టును. అది పీనసరోగభేదమైనను సుఖసాధ్యము. దీనిని జలదోషమనియు, జలుబనియు చెప్పుదురు.

1. జలపీనసము:—పడిసెము పట్టును, ఆయాసము గల్గును, దగ్గుకల్గును, కళ్లె పడును, తుమ్ము

నొచ్చును, ఆఁకలి మందముగ నుండును, దాహ మెత్తును, కంటియందును ముక్కు నందును నీళ్లు కారును, గొంతుకమ్మును, తలనొప్పి కల్గును, జ్వరము వచ్చును.

2. వ్రణపీనసము :—ముక్కునందు పుండు, తీట, ఇవి కల్గును.

3. నాసికా స్రావము :—సదా ముక్కునం డుండి నీళ్లు కారుచుండును.

4. రక్తపీనసము:—ముక్కు నుండి నెత్తురు కారును.

5. పూతినాసికా : — పడిసెము కంపుతో నుండును.

6. పూతిరక్తనాసికా :— కంపుతోఁ గూడి నెత్తురుపడును.

సకల నాసికారోగములయందును ఊపిరి విడుచుటకు కష్టముగా నుండును.

ఇంకను అలసత, ఆయాసము, నిద్రలేమి, కలుగు చున్నది.

## ప్రసుప్తి.

చర్మమునందలి నరములకు స్పర్శశక్తి తగ్గుటచే కలుగును. ఆచోట తిమ్మిరిగానుండును. గిల్లినను తెలియదు. కొన్ని సమయములయందు తెల్లగను, తిటనగలిగియును నుండుటయు కలదు. దీనికి ప్రసుప్తివాతమనియును పేరు కలదు.

## గ్రంథి.

రక్తము చెడుటచే నీరోగము కలుగుచున్నది. ఎచ్చట వాచి నొప్పిగానున్నను అది గ్రంథి యనం బడును. అదే గడ్డయగుటయును కలదు. బొబ్బ లగుటయును కలదు. కాయలై పగులక గట్టి యగుటయును కలదు. బుడిపిగా నుండుటయును కలదు.

## అస్థిగ్రంథి.

ఎముకలయొక్క పై భాగము నందుండుమజ్జకు బలముతగ్గి అందు నీరుచేరి చర్మముపైవాచి కురు

పగులును. దీనికే అస్థివ్రణమనియును చెప్పఁబడును. మఱియు ఎముకపగిలినను, లేక ఎముకపై గాయము లేక దెబ్బ తగిలి వాచినను అస్థిగ్రంథి యనఁబడును.

### వ్రణము.

రక్త దోషముచేత నీరోగము కల్గుచున్నది. ఇదే పుండు. ఈ పుండ్లలో పురుగులుండును. నీరు కాఱుచుండును. ఇట్టి పుండ్లపై వాలియుండునట్టి యీగలు మఱొకరిపై వాలిన మొదల పుండ్లు కలుగును. త్రాఁగునట్టి జలమున పురుగులుండినను అవి చర్మమునందేటి కురుపులను కలుగఁజేయును. మఱియు మిగుల వేదనమును, మంటలును, గొప్పదియును, అగు వ్రణము దుష్టవ్రణ మనఁబడును. ఇది పొత్తికడుపు, పక్కలు, వీపు ఈ ప్రదేశములందుండిన మిక్కిలి వేదనయుండును.

### అగ్నివ్రణము.

ఇది నిప్పులో పడినగాని, నిప్పును త్రొక్కినగాని, ఏదేని వేడిగల పులుసు చారు మొదలగునవి శరీరముపై బడినగాని కలుగును.

## విసర్పి.

ఈరోగము తఱుచుగా బాలురకే కలుగు చున్నది. చర్మముపై కొంతభాగమువఱకు ఎఱ్ఱగా వాచి బొబ్బలులేచును. మంట యుండును. జ్వరము అనుసరించియుండును. కొందఱు దీనిని అగ్ని అమ్మవారని చెప్పుదురు.

## విద్రధి.

వేదన, వాపు, మంట, రక్తవర్ణము, మొదలైన వానితోఁ గూడిన గడ్డ విద్రధి యనఁబడును. దీనియందు చీమునుండును. నెత్తురుండిన యెడల రక్తవిద్రధి యనియును, నెత్తురు గడ్డయని యును జెప్పుదురు. ఈరోగము ఉష్ణాధిక్యము చేతను, రక్తదోషముచేతను, కల్గును. చర్మము మిగుల దప్పముగానుండు స్థలమున విద్రధి కలిగిన యెడల మిగుల ఉపద్రవము చేయును. మేహరోగుల కిది కలిగిన యెడల మేహవిద్రధియనియును, రాజవ్రణము (రాచకురుపు) అనియును జెప్పఁబడును.

## మేహవిద్రధి.

ఈ రోగము మధుమూత్ర వ్యాధికలవారికి కల్గును. ఇది చర్మమునకు దిగువనుండు సన్నని పొరయందుండి యుద్భవించును. వాపును నొప్పి యు మంటలు నుండును. ఈ గడ్డ ఒకచోటనుండి మఱొకచోటికి వ్యాపించుటయు కలదు. ఇది సాముఖ్యముగా వీపునందును, పక్కలయందును, పొత్తికడుపునందును కల్గును. దీనికి బలహీనమే ముఖ్య కారణముగ నున్నది. దీనినే రాజవ్రణ మనియును, రాచపుండు అనియును, రాచకురుపు అనియును జెప్పుదురు. కొన్ని సమయములయందు ఈ విద్రధి అసాధ్యముగా పరిణమించుచున్నది.

## స్తనవిద్రధి.

స్త్రీలకు చనుగట్టులయందు కలుగు గడ్డ స్తన విద్రధి యనంబడును. దీనికిని విద్రధి చికిత్సయే చేయవలయును.

## సర్షపికా.

లింగము మీఁదగాని, శిశ్నము యొక్క చర్మములోపలి భాగమునగాని ఆవాలవలె బొబ్బలు లేచును. చీము వచ్చును. ఇది ఉష్ణముచేతనే కల్గును. ఇది మేహవ్రణ రోగముతో సంబంధించినది కాదు.

## మశరోగము.

ఇది తఱుచుగా బాలులకే గలుగును. దీనినే పులిపిరికాయ లని చెప్పుదురు.

## కుష్ఠము.

ఈ రోగము కొందఱికి పరంపరగా వచ్చును. కొందఱికి రక్తదోషముచేత సహజముగనే కలుగును. మఱికొందఱికి రోగస్త్రీసంభోగము చేత వచ్చును. ఈ రోగము చర్మమును లావుగా జేసి క్రమక్రమముగా వ్రేళ్లనుండి తగ్గించును. చర్మము వికృతమై లోటను కురుపులను కలుగఁజేయును. కొందఱికి చర్మము మాత్రము స్పర్శజ్ఞానములేక పోవుచున్నది. దీనినే పెద్దనొప్పి యనెదరు. ఇట్లి

నుండుకు కారణమేమనంగా, చికిత్సకు సాధ్యముకాని వ్యాధియనియే యుక్తి ప్రాయము. ఈరోగము చికిత్సచే సాధ్యమగునని చెప్పెదరు. అప్పుడు ఈరోగమును దద్రురోగ భేదమనియే తలంపవలయునే గాని కుష్ఠమని తలంపందగదు.

## కాటికా.

ఇది ఉష్ణముచేతను, చెమటచేతను, శరీరమునందలి మురికి చేతను లేచును. దీనినే చెమట కాయలని చెప్పెదరు.

## నాడీవ్రణము.

చర్మము లోపలి భాగము చెడుటచేత అచటనుండి పురుగువంటి నరము వెలికి వచ్చును. ఇది కలుగునపుడు జ్వరము వచ్చుటయును కలదు. త్రాగునట్టి జలము నందుండు పురుగు చర్మము మూలముగా వెలికి వచ్చుచున్నదని కొందరు చెప్పెదరు. ఈవ్రణము ఒకటి రెండు తావుల యందు కలిగినయెడల సాధ్యము. పలుచోట్ల

యందు కలిగెనేని అసాధ్యము. దీనికి తంతువ్రణ మని యను పేరు కలదు. ఇదే నారపుండు.

నాడీవిద్రధి.

పెద్దనాళములు వికసించి గడ్డ లేచును. నాడి కొట్టుకొనునట్లు ఈగడ్డ కొట్టుకొనును. మోకాళ్ల యందే తఱుచుగా నీగడ్డ వచ్చును. దీనికి శస్త్ర చికిత్సచేయరాదు. అట్లు చేసిన యెడల ఆనాళము భిన్నమై పోయి తర్వాత ఆ అవయవము చెడిపో వును. అందువలన చక్కగానగుచుటకు సాధ్యము కాదు.

శ్లీపదము.

ఇదివాతదోషముచేత, వాతనీరు ఒక్కచోటనే చేరి ఆయవయవమును స్థూలింపజేయును. బుడ్డదిగు టకును ఇదేకారణముగ నున్నది. ఈ రోగము ముఖ్యముగా కాళ్లయందే కలుగుచున్నది. దీనినే ఏనుగుకాలు అనియును, పాదార్బుద మనియును చెప్పుదురు. ఇట్లు మోచేతులకు క్రిందనుండెనేని హస్తార్బుదమని చెప్పుదురు. కాళ్లువాచి పిలకలు

పుట్టునుగాని, చేతులు వాచినపుడు పిలకలు పుట్టుట లేదు. కొందఱికి కాళ్లయందు పిలకలు పుట్టవలె లేచును. దానిని పాదవల్మీక మని చెప్పుదురు. శ్లీపదమును, హస్తార్బుదమును, పాదవల్మీకమును, అసాధ్యరోగములు. ఏచికిత్సకును సాధ్యముకాదు.

## ఉత్కారరోగము

మేహవ్యాధులు కలవారికిని అత్యుష్ణము కలవారికిని కలుగునట్టి దద్దులు. తీటయుండును. నీళ్లు కారుచుండును. ఒక్కచోటనుండి మఱొక చోటికి వ్యాపించును. నడుమునం దిట్లున్న యెడల రొండిగజ్జి యనబడును. కొందఱు దీనిని ఎంగిటి చిడుము అనియును, తామర అనియును, మేహపొడ యనియును జెప్పుదురు.

## పాదభేదము.

శరీరముయొక్క వ్యత్యాసముచే గుదికాళ్లు పగులును. కొందఱికి మాంసము తెలియునట్లు పగిలి నెత్తురుకాఱుచుండును. నడుచుటకును సాధ్యముకాదు.

### ముఖదూషికము.

ఇది యౌవనమునం దుండు వారికి ముఖమునందు కలుగును. ఇదే మొటిమ అనంబడును.

### లాంఛనము.

రక్తముచెడి శరీరమునం దచ్చటచ్చట నల్లగను, తెల్లగను మచ్చలు కలిగియుండును. వీని యందు కొన్ని సాధ్యము. కొన్ని అసాధ్యము. సాధారణముగా అనేకులకు ముఖమునందు ఇది కలుగుచున్నది. దీనినే వ్యాంగ మని చెప్పుదురు.

### అజగల్లి.

బాలురకు స్నానమును స్తన్యమును భోజనమును క్రమముగా లేనందుచేతను, పెద్దలకు మేహముచేతను శరీరమునందు బొబ్బలు లేచును. దీనియందుండు చీము బైటరాకమునుపు వేదనగా నుండును. చీము వెడలిన తర్వాత శీఘ్రముగా చికిత్స చేయవలయును. ఆలస్యముగా చేసినయెడల వ్రణరోగముగా పరిణమించును.

## మూత్రస్థాన విద్రధి.

రోగ స్త్రీసంభోగముచేత గజ్జలయందు గడ్డ కట్టును. వాపును నొప్పియు నుండును. ఇదే ఒడి సెగగడ్డ యనబడును. ఈ గడ్డ పగులుట అరుదు. ఇది అష్ఠీలికా ఉపదంశ రోగ భేదము. ఇదిగాక పెద్దచోట్లనైనను గాయముగాని, లేక గడ్డగాని యుండిన యెడల ఆస్థానముతో సంబంధించిన నాడియందును సంధులయందును బుడిపికట్టి నొప్పి గానుండుటయును కలదు.

## ఉపదంశము.

ఈ రోగము గోరుతాకిగాని, పల్లుతాకిగాని, మయోని (రోగముగల స్త్రీయొక్క) సంబంధము వలనగాని శిశ్నమునకు కలుగుచున్నది. దీనిని లింగవ్రణమనియు, మేహవ్రణమనియు, గుహ్యవ్రణమనియు, అలజివ్రణమనియు, ఫిరంగి రోగమనియు, చిట్టిఫిరంగియనియు, కొరుకు అనియు చెప్పుదురు. తరుచుగా ఈరోగము రోగస్త్రీ సంభోగ కాలమునందు లింగము మీదగాని,

లింగకవచమైన చర్మము మీఁదగాని విషసీసు పడుచోట లేచును. కొందఱు సర్షపికా రోగమునుకూడ మేహవ్రణమని భావించెదరు.

ఉపదంశ వ్రణవిషముపలె శరీరమును నశింపఁజేయు రోగము వేఱొకటియు లేదు. ఇది సకల ధాతువులను శోషింపఁజేయును. రక్తక్షీణమును జేయును. అశక్తిని పుట్టించును. శరీరము లోపలి అవయవములకు నష్టమును కలిగించును. నేత్రమందము, శిరోరోగము, నపుంసకము, వంధ్యాత్వము, గర్భపాతము, జిహ్వారోగము, నాసికాక్షీణము, కాళ్లుచేతులు పట్లు, బొబ్బలు, గడ్డలు, కుష్ఠము, మేహాదద్దులు, తీట, ఈ మొదలగు అనేక రోగములను కలుగఁజేయుచున్నది.

ఈ రోగమునందు పలువిధ భేదములు కలవు. వానిని నాలుగు విధములుగా భాగింపవచ్చును.

1. అస్థిరికా ఉపదంశము:—దీనిని కఠినోపదంశము అనియుఁ జెప్పవచ్చును. ఈరోగమునకు పాకముగుణముకలదు. రోగస్త్రీతో సంభోగము

చేసిన 2-4-6 దినములకుమీఁద గ్రంథులు లేచును. ఈ గ్రంథులయందు చీము ఉండదు. విషనీరు గజ్జలయందు నిల్చినయెడల వంక్షణాస్థాన విద్రధి యగును. అనఁగా రెండు ప్రక్కలయందును ఒడిసె గడ్డలు లేచును. తఱచుగా ఒక ఒడిసెగడ్డయే లేచును. ఈగడ్డ జాయివలె బిరుసుగా నుండును. చాలాదినములుండి తర్వాత నిమ్మళించును. ఈ గడ్డపగులదు. విషనీరు శరీరమునందు వ్యాపించి పలువిధములైన మేహదద్దులను కలుగఁజేయును.

2. మృదూపదంశము:—ఈవ్రణము విషనీరు తలిగిన 2-3 దినములకు తర్వాత వ్రణములు లేచి చీముకాఱుచుండును. ఈబొబ్బలు సుమారు ఒకటి రెండు నెలలలోపల స్వస్థమగును. ఈరోగము శరీరమునందు వ్యాపింపదు. ఒకానొకసమయమున ఒడిసెగడ్డగా లేచినయెడల అదిపండిపగిలిపోవును.

3. వ్యాపకోపదంశము:—ఇది లింగమును తినుచు నానాటికి లింగమును తగ్గించి వేయును. పలుచోట్ల వ్రణములు లేచును. శీఘ్రముగ నివర్తి

కాదు. దీనియందు ఒడిసెగ్గయు కలుగును. ఈరోగము శరీరముమీఁద వ్యాపింపదుగాని ఉదరములోపల వ్యాపించి పొత్తికడుపును వ్రణము చేయును. ఇది అసాధ్యరోగము.

4. పర్యుషితోపదంశము :— ఈ వ్రణము మిగుల దుష్టమైనది. ఈవ్రణము శరీరమునందు వ్యాపించి చెడుపు చేయకపోయినను విషనీరుపడిన పోటుమాత్రము ముఱిగిపోవును. ఇదిఒడిసెగ్గను కలిగింపదు. లింగము, లింగచర్మము ముఱిగి నప్పటికిని అది పడిపోయినయెడల త్వరగా ఆరిపోవును. ఈరోగము శరీరమును త్వరగా క్షీణింప జేయునట్టిదిగా నున్నది.

### కండూతి.

ఇది చర్మరోగము. కొందఱికి పలుమాఱు వచ్చును. శరీరమును అలక్ష్యముగా చూచువారికిది పట్టియుండును. దద్దులు, పుండ్లు, బొబ్బలు, చీటు, ఇవి యన్నియును ఈరోగ భేదములు,

ఈరోగమునకు పోకుడు గుణముకలదు. కావున ఈరోగముగలవారితో సాంగత్యము, వారిబట్టలను కట్టుకొనుట, వారిపడకయందు పరుండుట, వారు భుజించిన యాకులో మరల భుజించుట, ఈ మొదలగునవి కూడదు. ఈ రోగము పురుషుల చేతనే కలుగును. కుసుపులయందును పురుగు లుండును. దీనినే పామారోగమనియు, కజ్జారోగ మనియు, కొరుకు మనియు, జెప్పుదురు.

## శీతపిత్తము.

పైన చెప్పిన విధముగా అన్ని గుణములు నుండి దద్దులుగా నుండినయెడల శీతపిత్త మనియును, ఆమపిత్త మనియును, దద్రురోగ మనియును జెప్పుదురు. ఈ దద్దులు కొందఱికి అప్పుడేవచ్చి అప్పుడేనిమ్మళించును. దీనికి కాలనియమమును లేదు. తఱుచుగా బాలుర కిది వచ్చుచుండును. దీనినే కొందఱు "పురుగుకాటు" అనియును జెప్పుదురు.

## భగంధరము.

ఈరోగమునుగూర్చి పలువిధములుగా శాస్త్రములయందు జెప్పఁబడి యున్నది. ఇది లింగ

స్థావము లేక యోనిస్థానము మొదలు గుదస్థాన
ములకు లోపల నెచ్చోట్లనైనను లేచును. ఈ
ప్రదేశమునందు చిన్నరంధ్రములు కలిగి అందుండి
చీము స్రవించును. ఆసనద్వారసమీపమునందున్న
నాడులవలన మలము స్రవించును. ఈ రోగము ఉష్ణా
ధిక్యముచేతను, మూలవ్యాధి కలవారికిని, మేహ
రోగులకును కలుగును.

## చిల్వము.

గోటికి సమీపమునందు బొబ్బలేచి వాచి
నొప్పిగా నుండును. కొందఱికి జ్వరము ననుసరిం
చును. దీనియందు చీముండువఱకును వేదనయుం
డును. చీమువచ్చిన తర్వాత నిమ్మళించును. ఇదే
గోరుచుట్టు. దీనిని అక్షతరోగ మనియును జెప్పు
దురు.

## అగ్ని రోహిణి.

దీనినే తత్కాలమునందు మహామారి (ప్లేగు)
రోగమని చెప్పుచున్నారు. ఈరోగము జ్వరము
కలవారికి పిత్తోల్బణమైన వాతాదులచేత చంకల

యుండు మాంసఖండములవలె గడ్డలు లేచును. ఇవి నిప్పుతోఁ గాల్చినట్లు నొప్పిగా నుండును. 5-7-15 దినములలోపల మృతిని కలిగించును. ఈ దినములు తప్పినయెడల సాధ్యము.

### విదారిక.

పైన చెప్పినవిధమైన గడ్డలు గజ్జలయందున్న యెడల విదారిక యనఁబడును. ఈ గడ్డ నేల గుమ్మడుగడ్డవలెనుండుటచేత విదారిక (విదారిక) యనఁబడెను.

### కంఠగ్రంధి.

గొంతులోపల రెండుప్రక్కలయందు నుండు గోళములు వాచి నొప్పిగా నుండును. ఏదియు మ్రింగుటకు రాకుండును. ఇది శీతలముచేత గలుగును. దీనినే గళగ్రంధియని చెప్పుదురు. మలము మీఁద ఉమియుటచేత నిట్లు కల్గునని పామరులు కొందఱందురు.

## గండమాల.

కంఠముచుట్టును రక్తదోషముచేత మాలిక వలె గడ్డలుగాలేచును. వాపుండును, వేదనయుండును. ఈ గడ్డలు పగిలి వ్రణమగును. శీఘ్రమున నివృత్తి యగుటలేదు. ఇది తలిదండ్రుల వలన నుండి శిశువులకుఁ గలుగుచున్నది. ఈ రోగమును కంఠమాల యనియుం జెప్పుదురు.

## మసూరికా.

ఇది అనేకవిధములు. ఇదే స్ఫోటకము. పెద్ద బొబ్బలు లేచినయెడల పెద్దమ్మవారని చెప్పుదురు. చిన్నవిగా తీటకల్గి కండూతివలెనున్న యెడల క్షుద్రమసూరికయనియును, చిన్నమ్మవారని యును; దద్దులువలె నున్నయెడల తట్టమ్మవారని యును; చెప్పుదురు. ఈ అన్నిరోగములయందును ఆదియందు జ్వరముండును. పెద్దమ్మ రోగమునందు మాత్రము మిగుల బాధగానుండును. కొన్ని సమయములయందు అతిసార వ్యాధిని కలిగించును. ఈరోగము సాంక్రమికవ్యాధిగా నున్నది.

## సద్యోవ్రణము.

ఇదే గాయమనఁబడును. ఎక్కడైనస్థలమునం దుండిపడుట, దెబ్బవలన గాయమగుట, కత్తిమొదలగు ఆయుధములచే పోటుతగిలి గాయమగుట, గాజుపెంకులు లేక ముల్లువంటి ఇతరాయుధములు గుచ్చుకొనుట, ఆయుధాదులచే అవయవములలో నేభాగమైననుఖండింపఁబడుట, ఇళ్లుకప్పులు పైన బడుట, పశ్వాదులు కుమ్ముట, ఈ మొదలగు వానిచే హఠాత్తుగ సంభవించును. ఇది క్షతరోగ మనఁబడును.

## కంఠాలజి.

చెవికి సమీపమునందుండు గోళము వాచుట వలన నొప్పిగానుండును. ఇది సోఁకుడు వ్యాధి. గాలిమూలముగా సంభవించుచున్నది. కొందఱు దీనినే పుట్టాయి అమ్మవారనియును, బంగారు నిమిత్తమై వాచినదనియును తలంచుచున్నారు.

## ఉన్మాదము.

దీనినే పైత్యమనియు, పిచ్చియనియు, వెఱ్ఱియనియు, మదమనియు జెప్పుదురు. ముఖ్యముగా ఈ రోగము మెదడు చెడుటచేతనే కలుగుచున్నది. ఇందు బుద్ధియు, జ్ఞానమును లేకపోవుచున్నది. వేయి మాటలేల? ఈ రోగికి సుఖదుఃఖములే లేవు.

## భూతోన్మాదము.

ఈ రోగమును పిత్తోన్మాదమనియు, పిత్తజోన్మాదమనియుఁ జెప్పుదురు. ఇది సూతికాసన్నిపాత రోగమునం దొక భేదము. ఈ రోగమునందు మున్నువిన్న తనకుఁ దెలియని భాషలలో నొకటిరెండుమాటలాడుటయు, నవ్వుటయు, ఏడ్చుటయు, ఇత్యాది గుణములుండును. దీనినే పిశాచము పట్టినదని చెప్పెదరు. ఉన్మాద రోగమునకును అపస్మార రోగమునకును గల భేదమును తెలిసికొని చికిత్స చేయవలయును.

## అంత్రవృద్ధి.

ఈ రోగమునందు అంత్రక్షీణ వ్యాధిరోగ లక్షణ ములే కనబడును. అయినను దీనియందు జీర్ణశక్తి లేకుండును.

## గ్రహణి.

ఇందు ద్రావకాధికముగ మలవిసర్జన మగుటకు విశేషముగా పలుమారులు విరేచనమగును. ఆ మలము నీళ్ళుగాగాని, నురుగుగాగాని, గుజ్జుగాగాని, పిండికలిపినట్లు తెల్లగాగాని యుండును. కడుపు ఉబ్బును. శ్రమోతయుండును. పుల్లత్రేనుపులు వచ్చుచుండును. దీనినే అజీర్ణభేదియనియు, ఉష్ణభేది యనియు, భేదియనియు చెప్పుదురు. ఈ రోగము నందు ప్రేగులకు తాపిత ముండదు.

## అశ్మరి.

మూత్రమునందుండు ఉప్పు, రాళ్లుగా పరిణమించుటకు అశ్మరి యని పేరు. ఇసుకవలె సన్నపొడల

శర్కరాశ్మరియనియును, గులకఱాళ్లవలె నుండిన యెడల గ్రావాశ్మరి యనియును పేరొందును. మూత్రాశయ రోగములన్నియు ప్రమేహరోగ భేదములే. మూత్రపిండమునందు ఱాళ్లుకల్గి మూత్రద్వారమును అణచుచున్నది. అపుడు మూత్రము క్రమముగా రానందుచేత మూత్ర ద్వారము మొదలు మూత్రస్థానమువఱకును అతివేదనగా నుండును. మఱియు నడుము బీజములు తొడలు ఇవియు నొప్పిగా నుండును. వాంతి యుండును. బీజములు మీఁదికెక్కును. కొన్నిసమయములలో జ్వరమును వచ్చును. మూత్రబంధముచే కాళ్లు చేతులు చల్లనగుటయు కలదు. అశ్మరి (ఱాయి) బైటికివచ్చినమీఁద బాధయుండదు. ఱాయి పెద్దదిగా నున్నయెడల మూత్రనాళమును మూసికొనును. అపుడు నడుమునందు నొప్పియు, లింగమునందు వేదనయును, మూత్రాశయమునందు మంటయు నుండును. ఈమూత్రరోగమునందు పలు విధములైన భేదములుకలవు.

## మూత్రకృచ్ఛ్రము.

ఈ రోగము మూత్రము వెలువెడల నందు చేతను, మూత్రము లేకపోవుటచేతను, మూత్ర ద్వారము సంకుచిత మగుటచేతను, మూత్రద్వార ముచెంత మాంసము పెరిగి ఆమూత్రమును అడ్డగించుటచేతను కలుగును. సహజముగా ఉష్ణముచేతనే కొందఱికి మూత్రకృచ్ఛ్రము సంభవించుచున్నది.

## మూత్రదాహము.

ఇందుమూత్రము విడుచునపుడు మంటలుండును. మూత్ర ద్వారమునందు ఉష్ణ మధికమై జలము తక్కువ యగుటచేతను, మూత్రనాళము వ్రణమువలె నుండుటచేతను, మిగుల వేదనగా నుండును. అప్పుడప్పుడు నీరు కొంచెము కొంచెముగా దిగును. మూత్రాశయమునందు మూత్రము నిండి యుండు నట్లు తోచును. దీనినే నీరుచురుకు అని యును జెప్పుదురు. ఇది మిగుల వెట్టచేత కల్గు చున్నది.

## మధుమూత్రము.

ఈ రోగము మెదడు, అన్నాశయము, పక్వాశయము, ఇవి చెడుటచేతను; లేక రోగస్త్రీ సంబంధముచేతను కల్గును. మిగుల మూత్రము దిగును. దీనియందనేకవిధమైన ద్రాక్షశర్కర పంటి శర్కరయుండును. ఈరోగముయొక్క మూత్రము నందలి తీపును గ్రహించుటకై చీమలును ఈగలును మూగును. దీనికి క్షౌద్రమేహమనియు, మధుమేహమనియు పేరుకలదు. ఈరోగులకే రాచపుండు (మేహవిద్రధి) కలుగును.

## తంతుమేహము.

నూలిపోగువలె తెలుపు పడినయెడల తంతుమేహ మనఁబడును.

## నాళావృతవాతము.

ఇందు లింగమువాచి మూత్రము దిగునపుడు మిగుల వేదనగా నుండును.

## బహుమూత్రము.

ఇందు త్రాగినజలము కంటెను మూత్రము అధికముగా దిగును. దీనియందు చక్కెరయుం డదు. ఈ రోగికి అధిక దాహముండును. బల హీనముండును. దీనిని అతిమూత్ర మనియును, మూత్రాతిసార మనియును జెప్పుదురు.

## మూత్రక్షయము.

మూత్రాశయ స్థానమునందు మూత్రము ఊరనందుచే మిగుల తక్కువగా మూత్రము వచ్చును. లేక మూత్రము దిగకుండును. దీనినే మూత్రాఘాత మనియును, అమూత్ర మనియును జెప్పుదురు.

## మూత్రవస్తి.

మూత్రము బొట్టుబొట్టుగా అపుడపుడు పడు చుండును. ఇదే వసామేహ మనఁబడును.

## రక్తమేహము.

మూత్రముతోఁగూడ రక్తము పడును. లేక ఉత్తనెత్తురు స్రవించుటయు కలదు. ఇదే ఎఱ్ఱసెగ యనఁబడును.

## ప్రమేహము.

రోగస్త్రీ సంభోగమువలన మూత్రద్వారము వ్రణమై అందుండి తెల్లగా చీమువలె మూత్రముతో స్రవించును. శరీరప్రకృతిననుసరించి నలుపు, పచ్చ, ఎఱుపు, ఇత్యాది వర్ణములుగను స్రవించును. ప్రమేహరోగారంభమునందు దాహము, నిస్సత్తువ, పెదవు లెండుట, శరీరవేదనము, చెమట, ఇవి కల్గును. ఈరోగము తఱుచుగా మనుష్యుని యొక్క బలమును, ఆయువును హరించుచున్నది. దీనినే సెగరోగ మనియు, తెలుపు అనియుఁ జెప్పుదురు. ఇదియనేక విధములు.

### ఇక్షు మేహము.

మూత్రము చెఱుకు రసమువలె నుండును, చీమలుమూగును. ఇది మధుమేహమునం దించుక భేదముకలది.

### సాంద్ర మేహము.

మూత్రము సాంద్రముగాను, ప్రాతమూత్రము వలెను నుండును.

### సురా మేహము.

మూత్రము కల్లువంటి కంపు కల్గి గుజ్జుగా నుండును. ఇది తెల్ల సెగయం దొక భేదము.

### సికతా మేహము.

మూత్రము ఇసుక పోసినట్లుగా స్రవించును.

### శుక్ల మేహము.

శుక్లముతోఁ గూడి మూత్రము దిగును. ఇదే తెల్ల సెగ.

### శీత మేహము.

మూత్రము తెల్లగను మందముగను నుండును. ఇదియు తెల్ల సెగతోఁ జేరినదే.

పిష్ట మేహము.

మూత్రము నొక పాత్రయం దుంచి చూచిన యెడల అందు అడుగున పిండివలె నుండును.

మంద మేహము.

మూత్రము కొంచెము కొంచెముగా చాలాసేపు దిగును.

లాలా మేహము.

నోటి చొంగవలెను నూలిపోగువలెను మూత్రము దిగును. దీనికి మూత్ర మేహమనియు పేరు కలదు.

క్షార మేహము.

చౌటిమట్టి నీటివలె మూత్రము దిగును.

హారిద్రా మేహము.

పసుపు రంగుగా మూత్రము దిగును. ఇదే పచ్చ సెగ.

నీల మేహము.

మూత్రము నల్లరంగుగా స్రవించును. దీనికి కాల మేహమనియు పేరుగలదు. ఇదే నల్ల సెగ

### మజ్జా మేహము.

మజ్జతోఁ గూడి గంజినీళ్లవలె మూత్రముండగును. ఇది సురా మేహమునందు భేదము.

### హస్తి మేహము.

మూత్రము గజమదజలమువలెను ఉష్ణముగను గట్టిగను స్రవించును. ఈరోగులకు పిటకలనెడి బొబ్బలు లింగస్థానమునం దుండును.

### అస్థిస్రావము.

స్త్రీల యొక్క యోనిస్థానము నందుండి పాలవలెగాని, చీముడివలెగాని, చీమువలెగాని గర్భాశయమునందుండి బైలు వెడలుచున్నది ఇది దుర్బలము, అకాలప్రసవము, వ్యాకులము, అక్రమసంభోగము, అను నీమొదలగు కారణములచేఁ గల్గుచున్నది. రోగారంభమునందు స్రవించు ద్రవము జలమువలె నుండును. దినములైన మీఁద గుజ్జుగా మాఱును. పొత్తికడుపు, యోని, వీపు, ఈ స్థానములయందు వేదనయుండును. క్రమముగా ఈ వ్యాధిగలవారికి అశక్తియు, లేవలేని స్థితియు,

చేతులు కాళ్లు పడిపోయినట్లు నిస్సత్తువయు సంప్రాప్తించును. దీనిని గర్భస్రావమనియు, యోని స్రావమనియు, కుసుమ రోగమనియు, యోని మేహమనియు, మేహగర్భమనియు, గర్భమేహ మనియు, గర్భప్రమేహమనియు జెప్పుదురు. ఈ రోగమునందలి భేదమే సోమరోగముగ నున్నది.

### సోమరోగము.

ఇది పలువిధములు. స్త్రీలకు రక్తము యోని యందుండి స్రవించునేని రక్తప్రదరమనియును, అసృగ్దర మనియును, రక్త స్రావమనియును, జెప్పుదురు. శుక్లమువలె తెల్లగా యోనియందుండి స్రవించునేని శ్వేతప్రదర మనియును, సోమరోగ మనియును జెప్పుదురు. ఈ సోమరోగ ప్రారంభము నందున కుసుమరోగ లక్షణములే కల్గియుండును. సోమరోగము వృద్ధియైన పిదప మూత్రాతిసార మనఁబడుచున్నది. స్త్రీలయొక్క మూత్రాతి సారమునందు అపుడపుడు తెల్లగా మూత్రము స్రవించుచుండును. ఇట్లే పురుషులకు సంభవించెనేని ప్రమేహమని చెప్పఁబడును.

## సూతికాశూల.

శరీరము ఆరోగ్యముగా నుండునపుడు బహిష్ఠ స్నైన మొదల కడుపునొప్పి యుండదు. ఆరోగ్య ముగా లేనపుడు బహిష్ఠస్నైన దినము మొదలు రజస్సు వెడలుచుండు దినములందంతయు కడుపు నొప్పిగానుండును. కొందఱికి సూతికా రక్తము చక్కగా వెడలనందుచేతను, కొందఱికి గర్భగో శమునందు వేదనకల్గుటచేతను, కొందఱికి బల హీనముచేతను ఇది సంభవించుచున్నది.

ఈ రోగమును సూతికా వాయువనియు, రక్తగుల్మ మనియు, రక్తవాతపిత్తగుల్మ మనియు, ముట్టుకుట్టు అనియు, జెప్పుదురు.

## సూతికాబంధము.

ఈ రోగముయొక్క కారణములను నిర్ధరిం చుట కష్టము. అయినను వ్యాధి, శీతలము, వ్యా కులము దీనికి కారణములుగ నున్నవి. ఇది మూఁడువిధములు :—

1. పుట్టినది మొదలు జననేంద్రియములు వ్యత్యాసము చెందియుండుటచేత రజస్వలయే యగుటలేదు. దీనిని మూచకమ్మ అని చెప్పుదురు.

2. రజస్వల మైనప్పటికిని రజస్సు చక్కఁగా వెడల కుండును.

3. కొందఱికి రజస్సు చక్కఁగా వెడలుచుం డియు కొన్నాళ్లకు బొత్తిగా నిలిచిపోవును.

సూతికాసన్ని

ఈ రోగము వారివారి శరీరతత్త్వము ననుసరించి వివిధములుగా కన్పడును. ఎడమప్రక్క బొత్తికడుపునందు వేదన యుండును. మఱియు బంతివలెనుండు నొకవాయువుముద్ద లేచి రొమ్ము నణచును. శ్వాసము విడుచుటకు కష్టముగా నుండును. అపుడు చేతులతో రొమ్మును బాదుకొందురు. శరీరమువణకును. చేతులు కాళ్లు విదిర్చుచుండును. కన్నీరు కాఱును. ఈ రోగమునందు నవ్వు, ఏడ్పు, ఎక్కిళ్లు, భయము, పక్కశూలు,

దగ్గు, గొంతుకమ్ముట, కష్టశ్వాసము, తుమ్ము, అవు
లింత, మూత్రబంధము, మూత్రము అధికముగా
స్రవించుట, ఇత్యాదిలక్షణము లుండును. కొందఱు
ప్రజ్ఞయే లేక పడియుందురు. కొందఱికి వాతరోగ
మునందువలె చేతులు కాళ్లు పట్టుకొనును. దేహ
మంతయు నొప్పిగను వ్రణమువలెను నుండును.
కొందఱికి ఆకలి అధికముగా నుండును. కొందఱికి
ఆకలియుండదు. కొందఱికి జలమల విసర్జనము
కూడ పడకయుండే యగుచుండును. ఈ రోగము
నకు తగిన చికిత్స చేయవలయును. కొందఱు
దీనిని పిశాచము పట్టినదని భావించెదరు.

అనేకులు ఇది స్త్రీలకే గల్గునవెదరు. ఈరోగ
ము పురుషులకును గల్గుచున్నది. దీనికిఁ గారణము
నరముల యొక్క బలహీనమే గాని వేఱుకాదు.

### మూలికాపాఠము.

ఈ రోగలక్షణమును గూర్చి పలువురు పలు
విధములుగాఁ జెప్పెదరు. దీనికి ముఖ్య కారణమే
మనగా, మూలిక యనునైదు రజస్సు బలహీనము చేత

చెడి అదితెలుపగును. ఎప్పుడు రజస్సునకుదోషము కల్గి తెలుపైనదో అదిమొదలు శరీరము నందలి రక్తమును చెడిపోవును. అందుచేత ముందుగా ముఖము తెలుపగును. ఆమీఁద శరీరమును వివర్ణమగును.

## వంధ్యాత్వము.

స్త్రీలకు గర్భాశయమునందు దోషముండినను, పురుష వీర్యము చాలినంత లేకుండినను, స్త్రీ రజస్సు తక్కువయైనను, గర్భమున క్రిములుండి నను, సూతికావాతాది రోగము లుండినను, గర్భము నిల్వదు.

## రజస్వలా దర్శన దోషము.

గొడ్డురాలు తనకు బిడ్డకలుగు నిమిత్తమై ముట్టుస్నానానంతరము నందు ఏశిశువును జూచునో ఆ శిశువు క్రమముగా క్షీణించుననియును, లేక గతించుననియును, ఒకవేళ బ్రదికినను బ్రదుకుననియును, ఆ గొడ్డురాలు గర్భముదాల్చి వృద్ధిని

జెందుననియును, ఆ గోక్షురాలు చూచిన శిశువు మగ శిశువైన యెడల మగశిశువును, ఆడు శిశువైన యెడల ఆడుశిశువును కనుననియును జెప్పంబడి యున్నది. ఇట్లు చూడబడిన శిశువునకు సంభవించునదేమనఁగా, కడుపు ఉబ్బియుండును, తల వంగియుండును, తల వెండ్రుకలు రాలుచుండును, జ్ఞాపకము తక్కువగా నుండును, నోరెండుచుండును, అరకంటిచూపు కల్గియుండును, కాళ్లు చేతులు సన్నగిల్లుచుండును, దినదినము చిక్కిపోవుచుండును. ఈ లక్షణములను రజస్వాలాదర్శనమని గ్రహించి మంత్ర తంత్రములు చేయక మాంద రోగము లేక గణ రోగమని గ్రహించి చికిత్సయే చేయవలయును.

## గర్భభ్రంశము.

ఇందు గర్భము అస్థానమునుండి తప్పిపోవును. కొందఱికి గర్భము క్రిందికి జాఱిపోవును. కొందఱికి ఉదరమువంచే గర్భకోశము వేఱుస్థానమునఁ నిల్చి యుండును.

## గర్భాశయవక్రత్వము.

గర్భగోళము ముందుగా నైనను వెనుకగా నైనను అడ్డముగా నైనను లేక ఏదో యొకవిధముగా నైనను తిరిగిపోవును. దీనినే మూఢగర్భమని చెప్పుదురు.

## గర్భపాతము.

ఈ రోగము అస్థిస్రావమునం దొక భేదము. గర్భమునిల్చిన మూఁడునెలలకులోపల గర్భము చెడి స్రవించుటకు గర్భస్రావమనియును, ఆఱునెలలకు మీఁద గర్భము విచ్ఛిత్తియై స్రవించుటకు గర్భపాతమనియును నామము. ఈ గర్భపాతమునందు రక్తము అధికముగా వెడలును.

## గర్భాశయ శాపితము.

ప్రసవమైనతర్వాత పొత్తికడుపునందు వేదనయుండును. వ్రణమువలె నుండును. జ్వరమునుండును. మూత్రము తఱుచుగా దిగును. భేదియగుటయు కలదు. యోనియందుండి దుర్నీరు స్రవిం

చుచుండును. దినములైనమీఁద గర్భస్థానము స్పష్టమై ఱాయివలె నగును. కొందఱికి యీ రోగము అపూర్వముగా ఇతరసమయముల యందును కనుపించుచున్నది.

### సుఖ సన్ని.

బహిష్ఠయైన దినము మొదలు నాలుగు దినములలోపల సంభోగము చేసినను, లేక తైలస్నానముచేసిన పురుషుఁడు స్త్రీసంభోగము చేసినను, కొందఱికి జ్వరము వచ్చును. ఆ జ్వరము సన్నిపాత లక్షణములతోఁ గూడియుండును. మఱియు మేదస్సు చెడిపోవును. ఈ సన్నిరోగము కొన్ని సమయముల యందు అసాధ్యముగ పరిణమించును.

### గర్భ మూర్ఛ.

ఈరోగము గర్భిణిస్త్రీలకును ప్రసవించిన స్త్రీలకును గల్గును. మూర్ఛ కల్గినపుడు ప్రజ్ఞ యుండదు. ప్రజ్ఞ వచ్చినమీఁద మైకముగ

నుండును. ఇట్లు ఒకమాత్రేగాక పలుమాఱు సంభ
వించుచుండును. ఈరోగము మూత్రపిండమందలి
రక్తక్షీణము చేతనే కల్గుచున్నది.

## యోని శూల.

ప్రసవించిన తర్వాత శీఘ్రముగ యోనిని, శిర
స్సును, వస్త్రాదులచే బంధింపక పోయినయెడల
వాయువు ప్రవేశించి హృదయము, శిరస్సు,
పొత్తికడుపు, వీనియందు శూలను కలుగఁజేయును.
దీనినే మక్కల్లయని చెప్పుదురు.

## యోని కందము.

అతి సంభోగము, అతి శ్రమము, అతి నిద్ర,
అత్యుష్ణము, వీనిచేత యోనియందు నిమ్మకాయ
వలె నొక మొలక కల్గుచున్నది. దీనినే కొందఱు
అడుగు దిగుట, గూద, అని చెప్పుదురు.

## స్తన్యరోగము.

ప్రసవించిన స్త్రీలకు పాలుకట్టుకొని యుండు
టచేత స్తనములయందు వేదన యుండును.

## స్తన్యహీనము.

స్త్రీలలో కొందఱికి పాలు బొత్తిగా చేపక యుండును.

## పరిభవము.

గర్భిణి స్త్రీయొక్క స్తన్యమును శిశువు పానము చేసిన యెడల దగ్గు, అగ్నిమాంద్యము, వాంతి, మైకము, ఒడలెండిపోవుట, ఇవి కల్గును. దీనినే పారిగర్భ్యమనియును జెప్పుదురు.

## స్తన విద్రధి.

కొందఱికి స్తనములయందు గడ్డలేచును. దీనికి విద్రధి చికిత్సయే చేయవలయును.

## రదనోద్భవము.

బిడ్డలకు దంతములు మొలుచునపుడు అవి చిగుళ్లలో నుండి వెలికి రాకపోయినప్పుడు జ్వరము, ఛర్ది, మూర్ఛ, మైకము, ఈ మొదలగు రోగములు కల్గును.

## కుండాలరోగము.

బాలురకు శరీరమునందు ఎఱ్ఱగా పుట్టునట్టి గడ్డలు కుండాల మనఁబడును. దీనినే చెవ్వగడ్డలనియును, మచ్చలనియును జెప్పుదురు.

## క్రిమిరోగము.

బాలురకు కడుపునందు పురుగులుండును. ఈ పురుగులు మిగుల చిన్నవిగను, మిగుల పెద్దవిగను నుండుట కలదు. ఇవి కడుపునం దున్నపుడు కడుపునొప్పి, మైకము, జ్వరము, వాంతి, భేధి, అన్న ద్వేషము, ఇవి కల్గును. ఈ పురుగులు పెద్ద వారికిని యుండును.

## మాందము.

ఈరోగము శిశువులకును బాలురకును గలుగును. ఇందు కడుపుబ్రోంత, ఒళ్లువాపు, కండ్లు మూతలుబడుట, ఆమమును రక్తమును కలిసి భేదియగుట, పైయూపిరితీయుట, జ్వరము, భేది, పక్కలెగురవేయుట, ఒళ్లు చిక్కిపోవుట, మెడ సన్నగిలి యుండుట, బొమ్మముకలు కనబడుట,

జీర్ణశక్తి లేకపోవుట, ఇవి కలిగి యుండును. దీనినే గణరోగమని కొందఱు చెప్పెదరు.

## పాండు.

ఈరోగమునందు శరీరము తెల్లగా నుండును. శోఫ రోగలక్షణములు కొన్ని యుండును. అయినను ఇందు శరీరము వాపుగా నుండదు. రక్త క్షీణమే దీనికి ముఖ్యకారణము. బూడిద, మన్ను, ఇటికరాయి పొడి, బలపము పొడి, బొగ్గు, చింత పండు, వక్క, ఇట్టి వస్తువులను తినుటచేత కూడ ఇట్లగుట కలదు.

## కామిలా.

ఈరోగము యకృత్తు నందుండి కల్గు పిత్త జలము రక్తముతోఁ జేరినగాని, లేక ఆపిత్తజలము ప్రేగులలోఁ జేరుటకుగాక మఱల ఆరక్తముతోఁ జేరినగాని కల్గుచున్నది. ఇందు కన్ను, గోళ్లు, ముఖము, చర్మము, మూత్రము, ఇవి యన్నియు పసుపు రంగుగా నుండును. మలము తెల్లగా నుం

డును. ఆయాసము, నోటియందు చేఁదు, మైకము, సోమరితనము నుండును. కొందఱికి శరీరము వాచుటయు కలదు. దీనినే పిత్తపాండు రోగమనియు, పిత్తకామిలా రోగమనియు, యకృతూదరమనియుఁ జెప్పుదురు.

## నపుంసకత్వము.

ఈ రోగము పురుషులకు గల్గును. ఇంద్రియ నష్టమే దీనికిఁ గారణమని కొందఱు చెప్పుదురు. ఇంద్రియము నష్టమగుట లేదు గాని దానియుపయోగము మాత్రము తప్పి పోవుట కలదు. కొందఱికి పుట్టుక మొదలు జననేంద్రియములకు పటుత్వము లేకుండును. దీనికి చికిత్సచేసి ప్రయోజనములేదు. ఇట్టి పురుషులే ఖొజ్జాలనఁబడెడి పేడి జనులు. వీరిచర్య స్త్రీలచర్యతోఁ దుల్యముగ నుండును.

## ధ్వజ భంగము.

దీనియందనేక భేదములు కలవు. రోగవిశేషములయందు శుక్లస్రావనాడికి బలము తగ్గిపోవు

టచేతను; పీపు, తల వీనిపై దెబ్బపడుటచేతను; మధుమూత్ర రోగము చేతను; ఉష్ణక్షయము చేతను; శీతలపదార్థ సేవనముచేతను; భయముచేతను; మనోవ్యాకులముచేతను; బాల్యమునుండి ముష్టి మైథునము చేయుటవలన నాళము క్షీణమగుట చేతను; బాల్యమునందే స్త్రీభోగ మధికమగుట చేతను; శుక్లవృద్ధి తక్కువైపోవుట చేతను; వంశ వృద్ధి లేకపోవుచున్నది.

## శీఘ్ర స్ఖలనము.

కొందఱికి మేహరోగముచేతను, కొందఱికి మూత్ర రోగముచేతను, కొందఱికి అత్యుష్ణము చేతను, కొందఱికి శరీరప్రకృతి వ్యత్యాసముచేతను అతి త్వరితముగా ఇంద్రియము స్ఖలనమగును.

## స్వప్న స్ఖలనము.

సదా కామసంబంధమైన విషయములను చింతించు వారికిని, సదా సంభోగేచ్ఛకలవారికిని, ముష్టిమైథునాభ్యాసముకలవారికిని, విశేషముగా ఇంద్రియము ఊరుచుండు వారికిని, బ్రాలెక్కాలము

నను, లేక పగటి యందును, నిద్రబోవు నప్పుడును స్ఖలన మగును. కొందఱికి జాగ్రదవస్థయందును స్ఖలనమగుట కలదు. ఎట్లయినప్పటికిని తనంతట స్ఖలనమగు వానికి అశక్తి, జ్ఞాపకహీనము, తలనొప్పి, నేత్రమందము, అజీర్ణము, శూల, క్షయము, మూర్ఛ, కాకిసోమాల, ఉన్మాదము, మైకము, ఇత్యాది రోగములు కల్గును.

## శిరోరోగము.

తలకు అనేకరోగములు సంభవించుట కలదు. తలనొప్పినిగూర్చి సూర్యావర్తవాతమును చంద్రావర్తవాతమును జూచి తెలిసికొనునది. తలనొప్పి అనేక వ్యాధులు వచ్చుటకుముందును, వచ్చినపుడును గల్గుచున్నది. ఈ తలనొప్పి సంభవించిన దానికి ఏరోగము కారణమో ఆరోగమునకు చికిత్సచేసిన యెడల శాంతమగును. కొన్నిసమయములయందు తలనొప్పిమాత్రము వచ్చుటయు కలదు. అయినను పొగ, మంచు, ఎండ, వాన, నిత్యసంయోగము, నిద్రాభంగము, చింతన,

ఏడ్పు, అతిజలపానము, బహుభాషణము, ఈ మొదలగు వానిచేతను తఱుచుగా తలనొప్పి సంభవించుచున్నది. ఒంటితలనొప్పిని అర్ధభేద రోగమనియును చెప్పుదురు.

### శిరస్తాపము.

తలలో పోట్లు పొడుచును. మిగుల వేదనగా నుండును. ఎండను జూచుటకు కాకుండును. నాసికయందు జలము కాఱుచుండును. నెత్తి పగిలి పోవునట్లుండును. దీనినే శిరోశూలయనియును, కపాల శూల యనియును, చెప్పుదురు.

### రక్తశిరస్తాపము.

పైన జెప్పిన గుణములతోఁ గూడ జ్వరము, చెమట, మైకము ఇవియు నుండును.

### ఇంద్రలుప్తము.

పిత్తాధిక్యముచేత శిరస్సునందుండు రోమములు రాలిపోవును. అనఁగా ఇంద్రలుప్తమనెడి పురుగు రోమములయొక్క మూలములను కొఱికి

వేయును. రోమములకుదుళ్లు మందమై పడిపోయిన యెడల మఱల మొలుచును. రోమమూలము చెడి నమీఁద మొలువదు. తలలో చెమట విశేషముగా పట్టువారికి వెండ్రుకలు త్వరగా రాలిపోవును. కొందఱికి పరంపరగా నీస్థితి కల్గుచున్నది. జ్వరాది రోగములయందు చర్మమునకు బలముతగ్గి రాలి పోవును. బలముకలిగినమీఁద మఱల మొలుచును.

### ఖలతి.

కపాలమునందు వెండ్రుకలు మొలవక నున్నగా గోరువంటి రంగుగా నుండును.

### యూకారోగము.

వ్యాధిచేతను, చెమటచేతను తలయందు పేను పట్టును. ఇది తఱుచుగా తలలో మురికి చేరుట చేతనే కల్గును.

### పలితము.

పిత్తాధిక్యముచేతనే గాక, వ్యసనము, అతి సంచారము, అతిభయము మొదలగు కారణ

ములచేతను వెండ్రుకలు నశించిపోవును. పిత్తాధి క్యముచే నశించినయెడల శరీరప్రకృతి ననుసరించి కొందఱికి ఔషధాదులచే మఱల నలవడు చున్నది.

## శిరోవ్రణము.

బిడ్డలకును, బాలురకును, పెద్దలకును, శిరస్సునందు వ్రణము కల్గుచున్నది. తలయందు బిడ్డలకు కందూతి (చూడు=కరపాణి) మొదలగు రోగములు సంభవించుచున్నది. వీనికి ఆయా రోగ చికిత్సలే చేయవలయును.

## కుండాలరోగము.

బాలురకు శిరస్సున సంభవించునట్టి పక్కులు, గజ్జి, బొబ్బలు, గడ్డలు, ఈ మొదలగునవి. ఈ కుండాలరోగమునే కరపాణియని కొందఱందురు. ఇది తలయందుగా కాళ్లయందును కల్గుచున్నది.

## విష వ్రణము.

పిల్లలకు అపథ్యముచేత రక్తము చెడి సెగల ద్వారా చర్మముపై కంఠమాల (గడ్డ) గట్టును. దీనికి కంఠమాల చికిత్సయే చేయవలయును.

## ముఖ పాకము.

నోటియందు బూరుగముండ్లవలె నుండును. ఇవ్వి పిల్లలకు కలుగునని కొందఱనిరి. అందఱికిని కలుగుట యనుభవము. ఇదే శ్లేష్మజిహ్వ యనబడును. దీనినే కొందఱు ముఖదూషికమని చెప్పెదరు.

## ఆస్య పాకము.

నోటియందు కలుగు వ్రణము. దీనిని ముఖపాకమనియు చెప్పనొప్పును. ఈ ద్వివిధనామములందు భేదములేదు. దీనినే జిహ్వాలజయనియును చెప్పెదరు.

## జిహ్వారోగము.

ఇది పలువిధములుగ నున్నవి. జ్వరమునందు నాలుక యెండియుండును. పిండివలె నాలుక

ఖరాసనంటియుండును. సన్నిపాత జ్వరరోగముల యందు నాలుక యెండి ముండ్లవలె నుండును. ఆమాశయవ్యాధియందు నాలుక ఎఱ్ఱగానుండును.

## జిహ్వాలసము.

నాలుకయందు కంపుగ నుండును. అనఁగా నోరు కంపనియే గ్రహింప వలయును.

## అధిజిహ్వ.

నాలుక వాచి యుండును. చాఁగ కాలును.

## ఉపజిహ్వ.

కిరునాలుక పెరిగియుండును. పొడి దగ్గుగ నుండును. నోట నీరూరుచుండును.

## వాతజిహ్వ.

నాలుక చిట్లి యుండును. ఇదే జిహ్వాఖండము.

## పిత్తజిహ్వ.

నాలుకయందు ఉడికినట్లు దద్దులుండును.

జిహ్వాస్తంభము.

నాలుక కదలక యుండును. మాటలాడుటకు సాధ్యము కాకుండును. దీనిని జిహ్వాస్తంభ వాత మనియును జెప్పుదురు.

తాలుపాకము.

దవడ లోపల వ్రణము లుండును.

కచ్ఛపము.

దవడమీఁద తాఁబేలువలె వాచి నోరు తెరుచుటకు సాధ్యము కాకుండును. ఇదే గవదబిళ్ల యనఁబడును.

తాలుపిటకము.

దవడలోపల పొక్కియుండును. మ్రింగుటకు సాధ్యముకాదు.

తాలు శోఫ.

దవడ వాచి యుండును. ఇది గళావృత వాత భేదము.

## ఓష్ఠరోగము.

ఇది పలువిధములని చెప్పఁబడి యున్నది. కొందఱికి మంచుకాలమునను, మంచున దడిసినపుడును పెదవులుచిట్లును. ఉష్ణాధిక్యముచేతను పెదవులయందలి మాంసమునకు శోషితముకల్గి వ్రణమువలెనుండును. ఉప్పును కారమును తగిలినపుడు మంటగా నుండును.

## ఖండోష్ఠము.

దీనియందు పెదవులు చిట్లి యుండును.

## ఓష్ఠార్బుదము.

పెదవి వాచి బొబ్బలేచి యుండును.

## దంతభేదము.

పండ్లు నొప్పిగా నుండి దేనిని నమలుటకును, కరచుటకును, సాధ్యము కాకుండును.

## దంతశూల.

ఇది పండ్ల నరములతో సంబంధించిన వ్యాధి. దీనియందు మిగుల వేదనగా నుండును. పోట్లు పొడుచును.

### దంత చలనము.

పండ్ల వేళ్లకు బలముతగ్గి (లేక చచ్చిపోయి) కదలుచుండును. ఇదే దంతప్రలూన మనఁబడును.

### దంతపూయము.

పండ్ల వేళ్ల యందుండి చీము కాఱును.

### దంత విద్రధి.

పండ్ల వేళ్లయందు గడ్డలేచి చీము కాఱును. దీనినికూడా కొందఱు దంతపూయమని చెప్పెదరు.

### దంత పుపుటము.

పండ్ల వేళ్లు పుచ్చి పోవును.

### దంత మాంసరోగము.

నెత్తురు స్రవించుట, చీముకాఱుట, మాంసము పెరుగుట, ఇత్యాది రోగములు చిగుళ్లకు కలుగు చున్నది. తఱుచుగా రస సంబంధమైన ఔషధములు సేవించువారికి పైనచెప్పిన దుర్గుణములు చిగుళ్లయందు గానంబడుచున్నది. శరీరస్థితి

చెడిన వారికి దినదినము చిగుళ్లు అరిగి పంక్తిపళ్లు కనఁబడుచుండును.

### కర్ణస్రావము.

తఱచుగా బాలురకు చెవిలో చీముకారును. ఇది శరీరస్థితి చెడినందుచేతనే కల్గును.

### కర్ణశూల.

ఈరోగము స్పర్శనాడులను సంబంధించిన వ్యాధి. కొందఱికి అప్పుడప్పుడు కల్గి తత్క్షణము ననే నివర్తించును. ఇందు జ్వరము, వాపు, మొదలగునవి యుండవు. ఇదే చెవిపోటు.

### కర్ణవిద్రధి.

చెవినాళమును ఆవరించి యుండు మస్తకు వాపు కల్గును. దీనియందు తాపితరోగ లక్షణము లన్నియు నుండును. జ్వరము వచ్చును. క్రమక్రమముగా వేదన హెచ్చుచుండును. ఈ గడ్డపండి నీరుగానైనను లేక చీముగానైనను స్రవించును. కొన్ని సమయములయందు ఇది అసాధ్యముగ

పరిణమించుచున్నది. దీనికి కర్ణతాపిత రోగమనియు పేరుకలదు.

### కర్ణక్రిమి.

చెవియందు పురుగు లుండును. ఇది అపూర్వ రోగము.

### కర్ణనాదము.

ఇదే కర్ణఘోషము. దీనియందు చెవిలోపల శబ్దముగా నుండును.

### బాధిర్యము.

ఈరోగమునకు బాధిర్య వాతమనియును పేరు కలదు. జన్మమునుండి చెవుడుగా నున్న యెడల మూగ యగుదురు. చెవియందలి కర్ణభేరికిగాని, లేక శబ్దగ్రాహక నరములకుగాని దోషము కల్గిన యెడల సంభవించు బాధిర్యము అసాధ్యము. రోగాదుల చేతను, బలహీనము చేతను, పిత్తౌషధ సేవనము చేతను కల్గు చెవుడు సాధ్యము. మఱియు అధికమైన ధ్వనిని వినుటచేతను చెవుడు కల్గుచున్నది.

## నేత్రరోగము.

ఈరోగము అనేక విధములు. దీనిని గూర్చి ప్రత్యేకముగా శాస్త్రములున్నవి. "సర్వేంద్రియాణాంనయనం ప్రధానం" అని చెప్పఁబడియుండుటంబట్టి నేత్ర రోగమును చక్కఁగా పరీక్షించి బుద్ధిశాలురు చికిత్స చేయవలయును.

## భ్రూవాతోపము.

ఇది వాతరోగ భేదము. శీతల పదార్థములను దినుట చేతను, తడియుటచేతను, నొసలును నేత్రములును నెత్తియును పలుమాఱు దడదడ కొట్టుకొనును.

## కృచ్ఛ్రోన్మీలనము.

దీనియందు నిద్రపోయిలేచిన తర్వాత కండ్లజెప్పలు బిగువై తెరచుటకు సాధ్యముకాకయుండును.

## అక్లిన్నవర్త్మము.

ఇది కండ్ల ఱెప్పలయందు వాయుప్రకోప చేత ఱెప్పలను కదల్చినపుడు నొప్పిని కలుగఁ జేయును.

## సికతావర్త్మము.

కండ్ల ఱెప్పల లోపల ఇసుకవలె పిటకములు కలిగి యుండును.

## పక్ష్మశాతము.

కండ్ల ఱెప్పలయందుండు వెండ్రుకలు రాలి పోవును.

## క్లిష్టము.

కండ్ల ఱెప్పలయందు నీరుగ్రుచ్చుకొని మంట లును, పోట్లును, నుండును.

## కుకూణకము.

శిశువులకు పండ్లు మొలుచునపుడు కండ్లు ఎఱ్ఱ నై కూసలు పెరిగి ఉబ్బి యుండును. పోట్లు పొడు

చును. నెత్తురను చూచుటకు సాధ్యము కాక యుండును.

జలస్రావము.

కండలోనుండి నీళ్లు కారుచుండును. లేక నీళ్లు క్రమ్మి చుండును.

రక్తస్రావము.

కండ్లలోనుండి నెత్తురు కారును. ఇది అపూర్వము.

కఫస్రావము.

కండ్లలో పుసిళ్లు గట్టును. తెల్లగా గంజవలె నీళ్లుకారును.

పర్వణి.

కండ్లలోను లేక రెప్పలలోను పెసర గింజంత బొబ్బలేచియుండును. మంటలుండును. అది పగిలి నెత్తురు కారును.

నేత్రాలజి

నల్లగ్రుడ్డు వాచి తీటగను మంటగను పోట్లు పొడుచునట్లుగను నుండును. రెప్పలకు పగుళ్లు కల్గును.

## పూయ స్రావము.

రక్తముతోఁగూడి పుసి కాఱుచుండును.

## శుక్తికము.

తెల్లని కనుగ్రుడ్డునందు నల్లగానైనను, లేక నల్ల గ్రుడ్డునందు తెల్లగానైనను పొగ కప్పినట్లుండును. దీనియందు నొప్పియు మంటయు నుండదు.

## శుక్లార్మము.

తెల్ల గ్రుడ్డులో తెల్లగా తామరవలె అల్లును. దీని యందు నొప్పి యుండదుగాని వాపు ఉండును. దీనినే అధిమాంసజ మనియు జెప్పుదురు.

## పిటకము.

కంటియొక్క గ్రుడ్డునందు ఒకబొబ్బ లేచిన యెడల పిటక మనఁబడును. చాలాబొబ్బలు లేచి వేదనతో నుండినయెడల ఆజకా యనఁబడును.

## తిమిరము.

కన్నులకు చూచిన దంతయు విచిత్ర వర్ణములు గను, పొగకమ్మినట్లున్ను, ఎఱ్ఱగను, దేనిచూచినను

దాని యాకృతియంతయు నొకే విధమైన వస్త్రాలం
కారముగను, ఎదుటివాని ముఖముచూచిన ముక్కు
లేనట్లుగను, సూర్య చంద్ర దీపములు అనేకాకార
ములుగను తోఁచును. తిమిరము నందలి భేదమే
చత్వారి యనఁబడును.

### నేత్రకాచము.

పైనజెప్పిన తిమిరరోగ లక్షణముల కంటె
నధికముగా దీనియందుండును.

### లింగనాశము.

ఈ రోగమునందు కండ్లు తెలియదు. ఇదే
అంధత్వము. దీనియందొక భేదమే సమీపదృష్టి
యు నని తెలియునది.

### నకులాంధము.

పగటి వేళయందు దేని జూచినను వింతగా నగ
పడుచుండును. రాత్రియందు బొత్తిగా కండ్లు తెలి
యదు. దీనియందలి భేదమే పగల్చీకటి.

## నక్తాంధము.

సూర్యాస్తమయమైన మీఁద కంట్లు తెలియదు. దీపమున్నచో మాత్రము పొగకమ్మినట్లు తెలియును. ఇదే రేచీకటి. దీనికి ఉష్ణవిదగ్ధ మనియు పేరు కలదు.

## ధూమ్రము.

కంట్లు పొగకమ్మినట్లుండును. ఇది జ్వరాది ఉష్ణరోగములచేతను సంభవించుచున్నది.

## అభిష్యందము.

ఉష్ణాధిక్యముచేతను, ఎండకాలమునను, లేక ఒకరికి రోగముండినయెడల వారిని చూచినవారికిని, లేక ఈ రోగి కన్నులందు వాలిన దోమలు వాలుట చేతను కల్గును. పుసిల్లుకట్టును. పోట్లుండును. కన్నులు మూయుటకును తెరచుటకును కష్టముగా నుండును. రాత్రికాలమునందు మిగుల పోట్లుగా నుండును. దీనిని కన్నోప్పి యనియును, కంటికలక యనియును జెప్పుదురు.

పటంవము.

కంటి గ్రుడ్డు ఉబ్బిగాని, లేక ఎఱ్ఱగాగాని, లేక వ్రణమువలెగాని యుండును. వేదనగా నుండును.

పుష్పము.

అభిష్యంద రోగముచేతగాని, లేక ఉష్ణాధిక్య ముచేతగాని కంటిలో తెల్లగా పుష్పము పడును.

నేత్రకండూతి.

కన్నులయందు మిగుల తీటగానుండును. మఱియు కండూతిరోగ లక్షణములును కొన్ని యుండును.



ఇంతవఱకుఁ జెప్పిన రోగములన్నియు వారి వారి శరీర ప్రకృతినీ, కాలమును, సంసర్గమును, అనుసరించి కల్గునని తెలియఁ దగినది. కొందఱు మూఢులు మహాత్ముల పేరుపెట్టి వ్యాధులన్నియు పూర్వజన్మకృత దోషముచేత కల్గునని కొన్ని గ్రంథములను వ్రాసిరి. అట్టి గ్రంథోక్త విధుల యందు దాదాసీన్యము వహించి ఔషధ సేవచేసి యారోగ్యమొందు నట్టి మంచికాలము మన దేశ మునకుం గల్గవలయునని భగవంతుని ప్రార్థించెదము.



శ్రీ.

ఆరోగ్యమస్తు.

# ఏకమూలికాప్రయోగరత్నావళి.



## విషలక్షణ ప్రకరణము.



### విషము.

విషము కృత్రిమమనియు, అకృత్రిమమనియు రెండువిధములు.

### కృత్రిమవిషము.

దుష్ట స్త్రీలు తమప్రియులను వశపఱచి కొనుటకై చేయఁబడిన మిశ్రౌషధములు. ఇదే పెట్టుమందు. ఈ పెట్టుమందు తిన్నవారికి శరీరము క్రమముగా క్షీణించిపోవుననియును, లోపెండి నట్టుండుననియును, అతితాపమునుండు ననియును,

ఈ మందు జీర్ణముగాకుండుటచేగాక దానికి వెంట్రుకలును మొలిచియుండుననియును పానకాల యభిప్రాయము. దీనిని కృశరోగ మని భావించి చికిత్స చేయుటయే పరమోత్తమము.

### అకృత్రిమవిషము.

ఇది మూడువిధములు. 1 స్థావరము. 2 జంగమము. 3 ధాతుజము.

1. స్థావరమనఁగా, చెట్టు, పట్ట, వేరు, తీఁగె, పూలు, మొదలగునవి.

2. జంగమమనఁగా, సర్పములు, వృశ్చికములు, కీటకములు మొదలగునవి.

3. ధాతుజమనఁగా, పాషాణము, సౌవీరము, తామ్రము మొదలగునవి.

మఱియు విషశిలయను నదియొకటికలదని యనేకుల మతము. అది కండకు తెలియదు. దానిని త్రొక్కినయెడల మిగుల వేదనయుండును,

## సర్పదష్టము.

పాములలో పలుజాతులు కలవు. వాని పేర్లను వ్రాయుటచేతను, వానిని వర్ణించుటచేతను ప్రయోజనము లేదు. ముఖ్యముగా పాముకాట్లయొక్క లక్షణములను తెలిసికొని చికిత్స చేసినయెడల ప్రయోజన మగును. కనుక ముఖ్య లక్షణములను మాత్రము తెలియఁజేయఁబడును.

కొన్ని పాములకు విషము తక్కువగా నుండును. కనుక అది మనుష్యులను జంపదు. కొన్ని పాములవిషము మనుష్యులను జంపదుగాని స్వల్ప జంతువులను జంపును. కొన్ని పాములు నాలుకతో నాకును గాని కరువదు. నాకునట్టి గుణముగలపాములవిషము స్వల్పమే యైనను దినములకొలది అవయవములను తగ్గించును. కొన్ని పాములు తోఁకతో కొట్టును. తోఁకతో గొట్టినందుచేత మరణము కలుగదుగాని శరీరము వాచును. కొన్ని పాములు కరచినయెడల ముక్కు, కంఠము, నోరు, రోమద్వారములు వీనియందుండి నెత్తురు స్రవించును. నీటి

పాములలోఁ గొన్నిటికి విషములేదు. నీటి నాగు పామునకు విషము కలదు. సముద్రసంగమ స్థలములయందుండు కత్తితోఁకపాము తోఁకతోఁగొట్టినను, లేక కరిచినను విషముకలదు. కొన్ని పాములు పలుమాఱు జంతువులను కరిచి యుండును. అట్టి పాముల విషముచే మృతి కలుగదు. విషముగల పాముకాటునందు నాల్గుపండ్లు పూడియుండిన యెడల విషము అతిత్వరగా శరీరమునందు వ్యాపించును. ఒకటి రెండు పండ్లు పూడియుండిన యెడల నిదానముగా వ్యాపించును. కొన్ని పాముల విషముచేత ఒకటి రెండు దినములవఱకు కూడ ప్రజ్ఞలేకుండుట కలదు. ఏపామైనను కరిచియుట్లే పార్లినయెడల అధికముగా విషముదిగును.

పామువిషము నరముల మూలముగా తలకెక్కి మెదడును, రక్తమును చెడుపుచున్నది. ఇందుచేత ఆయాసము శోకము మైకము ఈడ్పు లేక వణకు కల్గును. పుపుసమునందు రక్తము అధికముగాఁజేరి శ్వాసబంధమును కష్టశ్వాసమునుకలు

గఁజేయుచున్నది. పాముకరచినవాఁడి యొక్క శరీర ప్రకృతిని, విషముయొక్క వేగమును అనుసరించి లక్షణములు వేర్వేరుగాఁ కనఁబడును. కొన్ని పాముల విషము మిగుల తీవ్రముగా నరముల మూలముగా సర్వావయవములను వ్యాపించి రక్తము నంతయు చెడిపి నీరుగాఁజేసి చంపును. కొన్ని పాములు కరచినచోట వ్రణమగుచున్నది. కొన్ని పాములు కరచినచోట మాత్రము వాపుగానుండును. కొన్నిపాముల విషము శ్వాసాశయమును వ్రణము చేయును. నాగుపాము కరచినయెడల ఆయాసము, మూర్ఛ, ఈడ్పు (సలుపు), మైకము, కష్టశ్వాసము నుండును. వాపు ఉండదు. నాగుపామును నాగుపాము కరిచినయెడల విషమెక్కదు. ఆ నాగుపామే విషముతక్కువైన పామును కరిచిన యెడల అది చచ్చిపోవును. ముంగిస, కోడి, నెమలి, గరుడపక్షి, వీనిని నాగుపాము కరచిన యెడల పాము చచ్చిపోవునని చెప్పుచున్నారు. అయినను పైనచెప్పిన జంతువులు పామునకు

భయపడక నిర్భయముగా కరిచి తునకలు చేయు చున్నది. పలు చోట్లలో పాముచే కరవఁ బడిన కోళ్లు మృతి నొంది యున్నవి. నాగుపాము విషమును మనుష్యులు తిన్నయెడల దుర్గుణములేదు. చంపదు. నరములలో మాత్రము విషస్పర్శ కల్గినయెడల ఆదిరక్తమునవ్యాపించి మరణము నొసంగును. నాలుకయందు వ్రణముగలవారికి సర్పవిష మీాయరాదు. కోడికంటియందు నాగుపాము విషమును విడిచిన యెడల కోడి చావదు. కోడిరక్తమునకు పాము విషమును గ్రహించు శక్తికలదు. పాములకు తలయందే విషముండుటచేత తలను కోసివేసి మిగతను వండితినెదరు.

## వృశ్చికదంశము.

తేళ్లు పలుజాతులు. చెట్టుతేలు, కొండతేలు, నల్లతేలు, అనునీ మూటికిని విష మెక్కువగాఁ గలదు. ఉష్ణప్రదేశముల యందుండు, తేళ్లకును విషము అధికముగా నుండును. కొన్ని తేళ్ల

యొక్క కొండెముల గణుపులయందు మిగుల వెంట్రుక లుండును. అట్టి తేళ్లు కుట్టినయెడల నోటి యందు చొంగ కారును. మైకముండును. మిక్కిలి చెమటపట్టును. రెండుమూడు దినములవఱకు కుట్టినచోట వేదనగా నుండును. కుట్టినచోట బొబ్బలేచును. ఏ తేలు కుట్టినను ముల్లువిరిగిపోయిన యెడల మిగుల వేదనగా నుండును. శరీర ప్రకృతిని, వయస్సును అనుసరించి వేదన హెచ్చు తక్కువలుగా నుండును. ఒకరికే ఒకప్పుడు కుట్టిన విషమెక్కదు. మఱొకప్పుడు కుట్టినయెడల విష మెక్కును. తేలుకుట్టి మృతినొందినవారు పలువురు కలరు.

ఈ తేళ్లజాతిలోఁ జేరిన పెద్దజాతికి మండ్రగబ్బ యని పేరు. ఇండ్లు మొదలగు ప్రదేశముల కంటెను, పుట్టలుండుచోట్లలో విశేషముగా నుండును. మండ్రగబ్బ విషముకూడ తేలువిషముతోఁ దుల్యముగ నున్నను మరణము నొసంగదు. చికిత్సకు సులభముగా వశమగును.

## ఆధారిక.

దీనినే జెఱ్ఱిపోతని చెప్పుదురు. దీనియందు చిన్నదిగానుండు జెఱ్ఱిని చెవిదూరుపామని చెప్పుదురు. దీనికంటెను ఎఱుపు పసుపు కలిసిన పెద్ద జాతిజెఱ్ఱి కరిచినయెడల తేలుకుట్టిన విషమువలెనే కరచిన ప్రదేశము చుట్టును మిగుల వేదన చేయును. కొందఱికి దీనివిషము చాలాదినములు శరీరమున వ్యాపించియుండి అప్పుడప్పుడు జెఱ్ఱివాని యాకృతిగల దద్దులు లేచును. కొందఱికి తేలు కుట్టినట్లుగనే మఱుదినము ఆవేళవఱకు వేదన యుండి నిమ్మళించును. చెవిదూరు పామనెడి చిన్న జెఱ్ఱిపోతు విషమునందును పైనచెప్పిన గుణములే కొంచెము తక్కువగా నుండును.

## శతపది.

ఇదే రోకటిబండ. ఇది కరిచినయెడల ఆచోట ఎఱ్ఱగను దద్దుగను నుండును. కొన్నిసమయముల యందు శరీరము నలుపగును. వాచును. పిటకలు పుట్టును. చెమటపట్టును. మైకమునుండును. దీనినే

శ్వేతపోతు అనియును, జెట్టిపోతు కరచినను ఇక్కే యుండుననియును, కొందఱ అనెదరు.

గౌళి.

బల్లి కరిచినయెడల బొమ్మనందు నొప్పియు, వాపును, మంటయు నుండును. చెమట పట్టును. బల్లి శరీరముపై మూత్రించినయెడల రోమద్వార ములందుండి ఆవాలవలె పిటకలు బుట్టును. బాధ యుండదు.

లూతా.

సాలెపురుగులలో పలుజాతులు కలవు. ఎని మిది, లేక పదికాళ్లపురుగు కరిచినను, నాకినను, సోకినను, మూత్రించినను, విసర్జించినను, బొబ్బలు లేచును. చీము కాఱును. ఆ రసి పడినచోటులం దెల్ల పలువిధములుగా బొబ్బలు లేచును.

భ్రమరము.

జలభ్రమరము, వనమక్షిక, మధుమక్షిక, గండోలి, వనపిపీలిక, కంబళికీటము.

ఈ భ్రమరములందు పలుజాతులు కలవు. కొన్ని భ్రమరములు కుట్టిన యెడల మిగుల వేదనగా నుండును. వాచును. దద్దుగా నుండును. మంటకలిగి యుండును. జలమునందు కొన్ని భ్రమరములుకలవు వాని కాటునందును పైన చెప్పిన గుణములే యుండును. ఇట్టే అడవియీఁగలు, అడవి తేనెటీఁగెలు, కందురీఁగెలు, అడవి చీమలు, కంబళిపురుగులు, ఈ మొదలగునవి కుట్టినపుడును, కరచినపుడును, సోకినపుడును, పైలక్షణములే యుండును.

సరట.

తొండ కరచిన యెడల చంద్రవంక వంటి గాయము కల్గును. వాపు, తీట, పోట్లు, తేపన, మైకము, మలమందు వివిధవర్ణములు నుండును. ఊసరవెల్లి కరచినను ఇట్టి గుణమే యుండును. కొందఱు పామువిషముకంటెను ఊసరవెల్లివిషము మిగుల ఉగ్రమైనదని చెప్పుచున్నారు.

## నలికండ్లపాము.

ఇది తొండజాతిలో నొకటి. ఇదే నలికిచు. ఇది కరచినయెడల శరీరము వణంకును. చొంగ కార్చును. నాలుకమందమగును. దీనికిని తొండకు చేయునట్టి చికిత్సయే చేయవలయును. కొందఱు నలికండ్లపాము కరువ దనెదరు. కొందఱు కరిచిన మీఁద బ్రదుకుటలేదని చెప్పెదరు. ఈ మాట నమ్మదగినది కాదు.

## గాధారము.

ఇదే ఉడుము. కొందఱు ఉడుమువంటి సర్పములని చెప్పెదరు. ఉడుమునకు విషము కలదని వదంతికలదు. దీనికిని సర్పచికిత్సయే చేయఁదగును.

## శునకదష్టము.

దీనికి జలద్వేషరోగమనియు, జలభయరోగమనియు, వెఱ్ఱికుక్కకాటనియు జెప్పుదురు. వెఱ్ఱికుక్క కరచినయెడల మిగుల అసాధ్యముగ పరిణ

పించుచున్నది. కుక్కకు ఉన్నట్లుండి వెఱ్ఱిపట్టినని యును, ఎండకాలమున కుక్కలకు మెదడు చెడి వెఱ్ఱిపట్టుననియును జెప్పెదరు. వెఱ్ఱికుక్క సదా నాలుకను వ్రేలవేసికొని చొంగకార్చుచుండును. ఈ కుక్క కరిచినపుడు ఆ చొంగ అందుచేరి నరములద్వారా రక్తమునందు వ్యాపించి పీనాదండాగ్రమును అనఁగా వెన్నముకయొక్క కొనను చెడుపును. దీని విషలక్షణము ఒక నెల మొదలు రెండేండ్లలోపుగా తెలియును. కొందఱికి 4-5-6-7 ఏండ్లకుమీఁద రోగము కనఁబడు ననియును చెప్పుచున్నారు. విషముయొక్క దుష్టత్వము శరీర ప్రకృతిని అనుసరించి కలిగినను తక్కువవయస్సు గలవారికి శీఘ్రమున వ్యాపించును.

ఈ రోగమునందు కంఠము, బొమ్మ అను నీ స్థలములయందుండు కండరములకు సలుపు, ఈడ్పు, వణకు, కలుగును. ఆయాసము, పొర్లాడుట, మైకము, వికారము, భ్రమ, చింత, కీళ్లసంధులు వీడిపోయినట్లుండుట, ఆగు నీగుణము

లుండును. ఈ రోగికి జలమును చూచినపుడు మిగుల భయముగా నుండును. కనుక జలరూపముగా దేని నిచ్చినను ఈడ్పు కల్గును కొందఱికి మూత్రద్వారమునందుండి కుక్కవంటి యాకృతిగల పురుగులు పడుననియును, ప్రాణావసాన సమయమునందు కుక్కవలె కూసి ప్రాణము విడుచుననియును జెప్పెదరు. ప్రకృతమున రాజాంగము వారు ఈ విషహరణము నిమిత్తము నీలగిరితోఁ జేరినట్టి కూనూరునందు వైద్యశాలను స్థాపించి యున్నారు.

## మూషక విషము.

ఎలుకలలో పలుజాతులు కలవు. ఏజాతి ఎలుక కరిచినను చికిత్స చేయవలయును. కరిచినపుడు మంటగా నుండును. కొన్ని యెలుకలు కరిచినపుడు ఏదుర్గుణమును డకపోయినను వానకాలమునందు హైయూపిరి తీయుటయును, దగ్గును కలుగుచున్నది.

## మండూకము.

కప్పకరిచినను లేక దానియెంగిలి సోకినను ఆ చోట నల్లగా పిటకలు పుట్టును. తీటగా నుండును. ఇంటిపంచలందుండు తెల్లకప్పలు (పాపనకప్పలు) బిడ్డలపై సోకినను, లేక మూత్రించినను, బిడ్డలు ఆకప్ప వలె సన్నగిలి పోదురని చెప్పెదరు. ఇది గణరోగ (మాందరోగ) లక్షణమేగాని కప్పచే నైనది కాదని తెలిసి చికిత్స చేయవలయును.

## నరదంత విషము.

మనుష్యులు కరిచినయెడల విషము కలదని చెప్పెదరు. ఇది విషముగా పరిణమించి చంపక పోయినను గాయమునకు తగినమందు వేసి త్వరగా మాన్పనియెడల అసాధ్య వ్రణమగును. నఖవిష మునకును అనగా గోటితో గీచిన దానికిని చికిత్స చేయవలయు నవెదరు. ఇది అంతగా దుర్గుణము కలదికాదు. అనేకులు వెఱ్ఱివాని పండ్లను గోళ్లను విషము కలదియని చెప్పెదరు.

శ్రీ.

ఆరోగ్యమస్తు.

# ఏకమూలికాప్రయోగరత్నావళి.



## గ్రహలక్షణ ప్రకరణము.



ఆయుర్వేద గ్రంథములయందు భూతవైద్య ప్రకరణమొకటి ప్రత్యేకముగాఁ జేర్పఁబడియున్నది. ఇది మంత్ర, యంత్ర, తంత్ర, అంజన, నస్యసాధ్యములు. దీని క్రియలు ధూపము వేయుట, రక్షకట్టుట, బలినిచ్చుట, అభిమంత్రించిన జలముతోఁ స్నాన పానములు చేయుట, అభిమంత్రించిన విభూతిని ధరించుట, మంత్రవేత్తయొక్క ముఖదర్శనము చేయుట, మాంత్రికునిచే నియ్యబడిన తంతువులను మాలికగా ధరించుట, దృష్టితీయుట, అనునివి మొదలగునవి.

ఇందువలన వైద్యశాస్త్రజ్ఞులుండ శిశిని మాత్ర ములు కూడ తెలుసుగాఁ దెలిసియే యుండవల సియున్నది. అనేకులకు మాత్రమే తెలియును. బాలురు మొదలగువారికి సంభవించుచున్నట్టి మాంద రోగములును, సన్నిపాతములును, అపస్మార ములును, శునకకాసమును, స్ఫోటకాదులును, గ్రహచేష్టితములని భావించెదరు. ఒకవేళ గ్రహమే యుండి సోఁకియున్నను వైద్యమును మానరాదు. మంత్రిసాధ్యమునకంటె వైద్యమే శ్రేష్ఠము.

మఱియు శిశు వుదయించిన ఒక దినము ఒక నెల ఒక సంవత్సరమునందు ఏదో యొక గ్రహము పట్టును. అని యీ రీతిగా చెప్పినపుడు, ఒక సంవ త్సరములో పండ్రెండు నెలలుండుటచేత, ఒక మంత్రవేత్త శిశువును జూచినపుడు, ఇది మూఁడవ నెల గ్రహముసోకి బాధపడుచున్నదని చెప్పును. మఱొక మాంత్రవేత్త ఇది ఒక్క సంవత్సరము లోపలి శిశువు కావున, మొదటి సంవత్సరము గ్రహము సోఁకినదని చెప్పును. వీరిద్దరిలో నెవరి

మాట సత్యమనఁగా, వారి వారికి యిష్టమైనవారి మాటయే. ఈ బాలగ్రహ లక్షణములన్నియును ఇంచుమించుగా నేకరీతిగనే చెప్పఁబడి యున్నది.

అయినను బహుకాలముగా మనదేశమునందలి జనులకు నాటియున్న యీ యభిప్రాయమును తొలగించుట కష్టము. కావున గ్రహచేష్టిత నివారణార్థము భూతవైద్యమును చేయవలయు ననెడి వారికొఱకు అనేక గ్రంథములను శోధించి, వ్రాయంబడుచున్నది.

## ద్వాదశ గ్రహములు.

వీనిలో పురుషగ్రహములు:— 1 స్కంద, 2 విశాఖ, 3 మేష, 4 శ్వగ్రహ, 5 పితృగ్రహములు.

వీనిలో స్త్రీగ్రహములు:—1 శకుని,2 పూతన, 3 శీతపూతన, 4 అంధపూతన, 5 ముఖమండలికా, 6 రేవతి, 7 శుష్కరేవతి.

## స్కందగ్రహము.

ఇది బాలురకు సోకినయెడల ఒకకంట నీరు కాఱును. పండ్లు కరచును.

## విశాఖగ్రహము.

తలవంచినను, లేక ఆవలించినను ఆ స్థలము నందే జల మల విసర్జన మగును. జ్వరమువచ్చును.

## మేషగ్రహము.

కడుపు ఉబ్బును. కాళ్లు చేతులు వేసినట్లే పడి యుండును. భేదియగును. ఎక్కిళ్లుండును. ఒకకన్ను వాచి యుండును.

## శ్వగ్రహము.

ఒళ్లు వణఁకును. గగురుపొడుచును. కుక్కవలె కూయును. కన్నులుమూఁతబడును. నాలుక కరచుకొనును.

## పితృగ్రహము.

జ్వరముండును. మిగుల నీచ్చును. దగ్గుండును. కండ్లు గుంతలుపడును. విలవిల తన్నుకొనును. భేదియు వాంతియు నుండును

శకుని గ్రహము.

భేదియగును. కంఠస్థానమందు వ్రణము లేక బొబ్బలు లేచును.

పూతనా గ్రహము.

కడుపు ఉబ్బును. వాంతియగును. దాహమెత్తును. మూత్రబంధమగును. గగుర్పొడుచును.

శీతపూతనా గ్రహము.

వణకు, ఏడ్పు, ఓరచూపు, భేది, శరీరమందొక పార్శ్వమునందు ఉష్ణము, ఇవి యుండును.

అంధపూతనా గ్రహము.

జ్వరము, వాంతి, దగ్గు, హీనస్వరము, తీట, వెక్కిళ్లు, భయము, వణకు, కృశత్వము, ఇవి యుండును. దీనిని అదృష్టిపూతన యనియును చెప్పుదురు.

ముఖమండలికా.

శరీరము చక్కగానున్నను, నరములు నల్లగా కనబడును. జ్వరముండును.

## రేవతీ గ్రహము.

కడుపుమీఁద కురుపులు లేచును. నానావర్ణ
ములుగా భేదియగును. కన్నొప్పి యుండును.

## శుష్కరేవతీ గ్రహము.

శరీరము చిక్కిపోవును. వెంట్రుకలు నిక్క
పొడుచుకొని యుండును. హీనస్వరముండును.
భేదియగును.

ఈపండ్రెండు గ్రహములయందును బాలురకు
శరీరమునందు ఏదో యొకవిధమైనట్టి కంపుగొట్టు
చుండును.

ఈ పండ్రెండు గ్రహములు గాక శిశువును
గాని లేక తల్లినిగాని ఆవేశించి పీడించు గ్రహ
ములు వేరే పండ్రెండు కలవు. కొందఱు శిశు
వును తల్లిని పీడించు ననెదరు.

---

## బాలగ్రహములు.

**1 నందన, 2 సునంద, 3 పూతన, 4 ముఖమం
డలి, 5 బిడాలిక, 6 శకుని, 7 శుష్కరేవతి, 8 బిలా**

ీక, 9 మదమేదస, 10 రేవతి, 11 అర్భక, 12 అద్భుత.

మఱికొన్ని గ్రంథములయందీ గ్రహనామములును లక్షణములును వేఱుగా చెప్పఁబడి యున్నవి. ఎట్లన:—

1 నందిని, 2 సునంద, 3 పూతని, 4 ముఖమండికా, 5 కటపూతన, 6 శకుని, 7 శుష్కరేవతి 8 బిడారిక, మఱొక గ్రంథమున 8 అర్యకా, 9 భూసూతికా, 10 నిఋతి, 11 పిలిపిచ్ఛిక(అర్భన) 12 కాముక.

ఇత్యాది భేదము లనేకములు గలవు. వానినన్నిటిని గ్రంథవిస్తర భీతిచే వ్రాయలేదు.

## గ్రహలక్షణములు.

### నందనా గ్రహము.

ఇది బిడ్డపుట్టిన మొదటిదినము మొదటి నెల మొదటి సంవత్సరమునందు సోఁకును. జ్వరము వచ్చును. ఒళ్లుచిక్కును. ఒళ్లువాచును. మలము నానావిధ వర్ణములుగ నుండును.

సునందాగ్రహము.

ఇది రెండవ దినము రెండవ నెల రెండవ సంవ
త్సరమునందు సోఁకును. జ్వరముండును. పండ్లు
కరచును. కడు పుబ్బును. అన్నద్వేషముండును.
కండ్లు మూఁతబడును. ఉలికి పడును.

పూతనాగ్రహము.

ఇది మూఁడవదినము మూఁడవనెల మూఁడవ
సంవత్సరమున సోఁకును. దీనియందును సునందా
గ్రహ లక్షణములే యుండును. గగుర్పొడుచును.

ముఖమండలికాగ్రహము.

ఇది నాలుగవదినము నాలుగవనెల నాలుగవ
సంవత్సరమున సోఁకును. జ్వరము, తలతిరుగుట,
శిరోభారము, కండ్లుమూఁతలుబడుట, అనునీ లక్ష
ణము లుండును.

బిడాలికాగ్రహము.

ఇది అయిదవ దినము అయిదవనెల అయిదవ
సంవత్సరమునందు సోఁకును. జ్వరము, ఒళ్లు

చిక్కుట, ఉబ్బసము, శూల, దగ్గు, ఎక్కిళ్లు ఉండును.

శకునీగ్రహము.

ఇది ఆఱవదినము ఆఱవ నెల ఆఱవ సంవత్సరమునందు సోకును. జ్వరముండును. ఒళ్లు చిక్కును.

శుష్కరేవతీ గ్రహము.

ఇది ఏడవదినము ఏడవ నెల ఏడవ సంవత్సరమున సోకును. అన్నద్వేషమును, ఆవులింతయు నుండును.

బిలాళిక.

ఇది ఎనిమిదవదినము ఎనిమిదవ నెల ఎనిమిదవ సంవత్సరమున సోకును. దీనియందు శుష్కరేవతీగ్రహ లక్షణములే యుండును. మఱియు కండ్లు మూతబడును. ఏడుపు ఉండును.

మదమేదస్గ్రహము.

ఇది తొమ్మిదవదినము తొమ్మిదవ నెల తొమ్మిదవ సంవత్సరమున సోకును. జ్వరము, వాంతి,

శోష, కడుపు ఉబ్బరము, దగ్గు, అన్నద్వేషము, చవినొప్పి, యుండును.

రేవతీ గ్రహము.

ఇది పదియవ దినము పదియవ నెల పదియవ సంవత్సరమునందు పోకును. దీనియందు మంద మేదసా గ్రహ లక్షణము లన్ని యుండును.

అర్భకా గ్రహము.

ఇది పదునొకండవ దినము పదునొకండవ నెల పదునొకండవ సంవత్సరమున పోకును. దీని యందు బిలాళికా గ్రహ లక్షణము లన్నియు నుండును.

అద్భుత గ్రహము.

ఇది పండ్రెండవదినము పండ్రెండవ నెల పండ్రెండవ సంవత్సరము పోకును. పండ్లు కొరకుట, ఏడ్పు, కన్నొప్పి, గగుర్పాటు, ఇవి యుండును.

---

పైన చెప్పఁబడిన ద్వాదశ గ్రహములును, బాలగ్రహములును, బాలురను పీడించునని చెప్పఁ

బడినది చాలక, ఆగ్రహాలక్షణములకు అన్యముగా నుండువానిని పక్షిగ్రహ చేష్టితములని చెప్పిరి. ఇవి గాక సందుకొట్టుట మొదలగునవి యెన్నియో కలవు.

### పక్షిగ్రహము.

బాలురను పక్షిగ్రహము లనునవి పట్టునని యును, ఆ గ్రహములు బిడ్డలను తెల్లవాఱుజాము నను, సంధ్యా కాలమునను, రాత్రియందును ఇల్లు దాఁటి తీసికొని పోయినను, లేక బయలున తీసికొని పోయినను, పక్షిరూపముగా ఆకాశమున సంచరించు నట్టి గ్రహములు బిడ్డయొక్క శిరస్సునకు సరిగా వచ్చినపుడు అవి సోఁకునని పామరులయభిప్రాయము. శాస్త్రములయందు ఈ పక్షిగ్రహములు స్త్రీ, పురుష, నపుంసక, వంధ్యా, అని నాలుగువిధములనియును, వాని సోఁకుడుచే కొన్ని రోగములు కల్గునని యును జెప్పఁబడి యున్నది.

### పక్షిగ్రహ లక్షణము.

పైనచెప్పిన నాలుగు విధములైన పక్షులుసోఁకినపుడు గల్గు గుణములను గూర్చి వేర్వేరుగాఁ

చెప్పఁబడి యున్నను, అవి యించుక భేదము నే
కల్గియున్నందుచే సముదాయముగా వాని లక్షణ
ములను వ్రాయఁబడును. ఒడలు నశినెత్తి, భుజ
ములు, వీపు, వీనియందు పట్లము పడును. భేది,
వాంతి, జ్వరము, దాహము, వణకు, నిస్సత్తువ,
నిద్రాహీనము, ఇవి యుండును. పాలు త్రాగదు.

ఈ గ్రహములుగాక వైద్యశాస్త్రకు సాఁకినట్టి
అనేక గ్రహములు కలవు. వానినన్నిటిని వ్రాసి
ప్రయోజనములేదు. ఆహా! ఇంతటి బలముగల
గ్రహములు ఏ రైలుబండిని, ఏ స్టీమరును అడ్డగిం
చెను? ఏ కొండనెత్తి మఱొకచోటికిఁ దీసికొని
పోయి యుంచెను? ఏ చెఱువునీళ్లను పానముచే
సెను? ఏ చెట్టును పెరికివైచెను! లేదు! లేదు!!
విమర్శింపఁగా బ్రతుకుకొఱకు వ్రాసిన కల్పనలే
యనియును వాస్తవమునందు గ్రహమే లేదని
యును తెలియుచున్నది. కాఁబట్టి వివేకులు సకల
గ్రహలక్షణములను వ్యాధిలక్షణమని భావించి
చికిత్స చేయఁదగినది.

శ్రీ.

ఆరోగ్యమస్తు.

# ఏకమూలికాప్రయోగరత్నావళి.



## చికిత్సా ప్రకరణము.



### మూలికా లక్షణము.

ఒక్కొక మూలిక యందును అనేక జాతులు కలవు. ఏచోట నేది దొరుకునో దానినే వాడ వచ్చును. యోగమందు నల్ల తులసి, నల్ల ఉమ్మెత్త అని చెప్పి యున్నపుడు, వానికి బదులుగా తెల్ల తులసి, తెల్ల ఉమ్మెత్తను వాడ వచ్చును.

సమూలమని యోగమునందు చెప్పియుండిన యెడల చెట్టు వేరు ఆకులు పువ్వులు కాయలు విత్తులతో గూడినది యనియే తెలియునది. అయినను వేరుతోనుండిన యెడల చాలును.

ప్రతిమూలికయు పురుగులు చీడ మొదలగు దోషములు లేనిదియును, మంచి స్థలమున పుట్టినదియును, జీవముతో నున్నపుడే తెచ్చి యెండబెట్టినదియును, ముగ్గి పోనిదియును నై యుండవలయును.

మఱియు తనంతట యెండినదియును, చాలా దినములు కడచినదియును, పుప్పికలదియును పనికి రాదు

శొంఠి, ఇంగువ, పసుపు, మిరియములు, ఇత్యాది వస్తువులను మాత్రము సంవత్సరముదనుక నుపయోగింపఁ దగును.

### మూలికా నిర్ణయము.

చిగురు, ఆకులు, పువ్వులు, పిందెలు, కాయలు పండ్లు, విత్తనములు, తీగెలు, పట్ట, గడ్డ, వేఱు, కఱ్ఱ, రెమ్మ, పీచు, నార, గర్భ, బదనిక, బంక, తేనె, బెల్లము, కలకండ, ఇంగువ, కర్పూరము, సాంబ్రాణి, గుగ్గులము ఈ మొదలగునవి యన్నియును మూలికలని తెలియఁదగినది.

## ఔషధసేవన వేగము.

కొన్ని ఔషధములు భుజించినపుడు శరీరమం నందు వ్యాపించినమీఁద వాని గుణములు కనఁ బడుచున్నవి. పాదరసమును తినిన ఇగుళ్లు వుండ గును. గంధకము తినిన శరీరమంతయు గంధకపు కంపుగొట్టును. పాషాణము, తాళకము, మనో శిల, వీనిని తినిన కంఠము ఎఱ్ఱబడును. ఆయాసముగ నుండును, ముఖము వాచును, జీర్ణావయవములు చెడును. తీయమును తినిన మలము నల్లగానుం డును. వంగము తినిన ఇగుళ్లు నీలి రంగుగ నుం డును, నోరెండును. విషముష్టి గింజను తినిన కండ లకు ఈడ్పుకలుగును. భేదిగడ్డ (రేవల్‌చిన్ని) తినిన మూత్రము ఎఱ్ఱగా దిగును. ఉమ్మెత్తపసరు, ఉమ్మెత్త విత్తనములు, గంజాయి, అఫీని, పొగాకు ఇవి తినిన మైకమును, విచిత్ర ప్రలాపములును నుండును. మఱి కొన్ని తీక్ష్ణమైన ఔషధములు సేవించినను దుర్గుణములు కల్గుచున్నది.

## ఔషధ వేగము.

జీడిపొగ, జముడుచెట్టు సీస, జిల్లేడుపాలు పసుపు, ఈ మొదలగు వానివలన కొందఱికి శరీరము వాచును. కొందఱికి చిన్నబొబ్బలు లేచును.

## ఔషధ స్పర్శ వేగము.

తీటకసింద సోకిన దురద కల్గును, దద్దు లగును. నల్లేరు పసరు, అడవికంద బరడు, ఇవి తీటను బుట్టించును. జముడుపాలు, జిల్లేడుపాలు, అగ్నివేంద్రపు పసరు, చిత్రమూలము సమూలము, ఆవాలు, ఇవి బొబ్బలను పుట్టించును.

మూలికలలో ననేకములు మనుష్యులయొక్క ఆయువును హరించునవి కలవు. వానిని తెలియఁజేసిన అపాయము సంభవించునని విరమింపఁబడియె.

## ఔషధసేవన కాలము.

1. వాతరోగులు భోజనముచేయుటకుముందు ఔషధమును సేవింపవలయును.

2. పిత్తరోగులు భోజనమధ్యకాలము నందు ఔషధమును సేవింపవలయును.

3. శ్లేష్మరోగులు భోజనానంతరము ఔషధమును పుచ్చుకొనవలయును.

ఔషధము పుచ్చుకొన్నతర్వాత నోటి వెగటును బోగొట్టు కొనుటకు, తమ్ములపాకుకాడ, లవంగము, ద్రాక్షపండు, ఏలకులు, పోకచెక్క, కలకండ, ఇత్యాది మధుర పదార్థముల నుపయోగింప వచ్చును.

## ద్రవ్య శుద్ధి.

మూలికలన్నిటికిని శుద్ధి అక్కఱలేదు. చెడుపు చేయఁదగిన వస్తువులను మాత్రము శుద్ధి చేయవలయును.

శొంఠి, పిప్పలి, మిరియములు, ఓమము, జీలకర, ఇత్యాది వస్తువులను ఎండబెట్టిన యెడల చాలును. లేక వేచ్చ్చచేసినను చాలును.

తెల్లగలిజేరుతేరు పతంగి చెక్క, తెగడవేరు, చన్నేరుగడ్డ, అడవికంద గడ్డ, వట్టేరు, భూచక్ర

గక్ష్, ఇత్యాది వస్తువులను ఆవు పాలతో ఉడికించి నీడను ఎండించిన శుద్ధియగును.

నేపాళ శుద్ధి

ఎనుము పేడను పులికడుగు నీళ్లలో కలిపి, అందు నేపాళగింజలను ఉడకబెట్టి తీసి కడిగి దాని తోలును లోపలి ఆకును తీసివేసి, ఆ పప్పును నిమ్మపులుసు, ఆవుపాలు, పులికడుగు, మిరియాల కషాయము, వీనిలో నొక్కొక దానియందును మూడేసి దినములు నానబెట్టవలయును. ఒక్కొక దానినుండి తీయునపుడంతయును లెస్సగా కడిగి వేరొక దానియందు వేయవలసినది.

వసనాభి.

వసనాభిని ఎనుము మూత్రమునం దొక దినము నానవేసి పిదప కడిగి మఱల ఎనుము మూత్రముననే వేసి ఉడకబెట్టి యెండించి నిమ్మపండ్ల రసమునం దొక దినము నానబెట్టి యెండించ వలయును.

భల్లాతకి.

జీడిగింజలను ముక్కలు కత్తిరించి సున్నపు తాళ్లలోనుంచి నీళ్లుపోసి యుక్కగొంచెము పెట్టించి

యుంచి తర్వాత పులికడుగుచేత ఆఱేడుమాఱ్లు
చక్కఁగాఁ కడిగి, అమీఁద మంచినీళ్లతో అయి
దాఱుమాఱ్లు కడిగి, పిమ్మట ఎనుముపేడ కలిపిన
జలమునను, సున్నము కలిపిన జలమునను, చింత
చిగురు నూరి పులికడుగుతో కలిపిన జలమునను,
మోదుగుపూల కషాయమునను ఉడకబెట్ట వల
యును.

మఱిఁ గొందఱు జీడిగింజలను ముక్కలు కత్త
రించివేసి తక్కిన దాన్నిని తునకలుచేసి నేతితోఁ
గాని, లేక ఆముదముతోఁగాని వేయించి తీసి
కొనెదరు.

వాతారి.

బాదము పప్పును వేడనీళ్లలో నానవేసి చర్మ
మును తీసివేయవలయును.

జాజికాయ

జాజికాయను నాలుగుగా ఖండించి నేతితో
వేయించ వలయును. లేక అన్నముతో గూడా
ఉడకబెట్టి తీసికొనవచ్చును.

## కలంజా.

గంజాయి, జడలోని విత్తులను కాడలను తీసివేసి మంచినీళ్లలో కొంచెము సేపు ఊరఁబెట్టి పిసికి నాలు గైదుమాళ్లు కడిగి యెండబెట్టవలయును. కొందఱు తొమ్మిదిమాళ్లు వెచ్చచేసి ఔషధముల కుపయో గించెదరు.

---

## విష ప్రతివిషము.

అభినిని విషమించు నట్లుగా తిన్నవారికి, మాచి కాయ కషాయమును గాని, లేక తొగరుగల వస్తువులయొక్క కషాయమును గాని, యిచ్చిన శమన మగును.

పాదరసము, పాషాణము, సౌవీరము, మొద లగు ఔషధములను సేవించిన దోషమువలన, నోరు పట్టినయెడల నీలివేరు, గరికవేరు, మిరియాలు, వీనిని సమభాగముగా కషాయముచేసి యిచ్చిన యెడల నివర్తియగును.

గంజాయి తిన్న విషమునకు, చింతపండు కలిపిన పులుసు, నిమ్మపులుసు, ఆరఁటిపట్టల రసము,

పులికడుగు (వినిగర్, తెల్ల ఉల్లిగడ్డల రసము, వేడి నీళ్లలో కలిపిననేయి, వీనిలో దేనినైనను నొక దానిని యిప్పించవచ్చును.

గన్నేరునూనెకు, కరక్కాయ కషాయ మియ్య వలయును.

సున్నముతిన్నవారు, పసుపునూరిన ముద్దను నోటియందుంచి కొనినను, లేక తిప్పతీగెరసముతో నోరు పుక్కిలించినను శాంతమగును.

కందగడ్డ దురదకు, చింతపండును గాని, లేక తమ్ములపాకుల రసమునుగాని యిచ్చిన యెడల శమించును.

జిల్లేడుపాలు త్రాగినయెడల, నీలియాకు పసరును గాని, లేక నీలివేళ్ల కషాయమును గాని, నువ్వులునుచక్కెరనుగాని, ఆముదమునుగాని, పసుపు నూరిగాని యియ్యవలెను.

పాలుఅధికముగా త్రాగినందు చేత కడుపుతొందరగా నున్న యెడల, శొంటి పిప్పలి మిరియాలు, వీనిని కషాయముచేసి యిచ్చిన శమనమగును.

అరఁటిపండ్లు తిని దుర్గుణము కనుపించిన యెడల, మిరియాల కషాయ మియ్యవలయును.

సకల ఫల భక్షణాధికములకును సొంటి మిరియాలువేసి కషాయముచేసి యిచ్చినయెడల గుణ మిచ్చును.

మాంసభోజనముచేసినవారికి,కడుపునొప్పిగాను, వేదనగాను ఉన్న యెడల, పత్తియాకురసమునుగాని, లేక మజ్జిపాలనుగాని యిచ్చిన శాంతమగును.

గోధుమపిండి మొదలగు వానికి, ఇంగువను బెల్లముతో చేర్చి నూరిగాని, లేక కొత్తమల్లి కషాయమును గాని యిచ్చినయెడల గుణమగును.

రేలను సేవించి అధికముగా భేది యగువారికి, తమ్ములపాకులరస మియ్యవలయును.

తామ్రపుచిలుము కడుపులోనికి పోయినందుచే కలుగు వాంతి మొదలగు దుర్గుణములకు, వావిలి యాకురసమిచ్చిన శాంతమగును.

సిందూరములు సేవించి విషమించిన యెడల, పత్తికాయల రసము, నిమ్మపులును, ఆవుపాలను,

వీనిని సమముగా చేర్చి, అందు కలకండపొడి కలిపి పుచ్చుకొన్న శమించును.

పాషాణమును తిన్నవారికి, మిరియాలు, చిత్రికూర, నీలి, తులసి, కాకరాకు, ఆముదము, వీనిలో దేనినైన నిచ్చినయెడల శమనమగును. మరియు మిరియాలు నూరి ఎనుము వెన్నలో కలిపి లోనికిచ్చి, ఎనుము పెరుగులో గంధమును కలిపి శరీరమునకు లేపనము చేయవచ్చును.

వత్సనాభి తిన్నవారికి, చిత్రికూరవేళ్ల కషాయ మియ్యవలయును. చెట్టు మేకమూత్రమును నియ్య వచ్చును.

తెగడను సేవించి అధికముగా భేదియగువారికి, తెల్లతుమ్మచెక్క కషాయ మియ్యవలయును.

జెముడుపాలకు, తంగేడువేరు కషాయ మియ్య వలయును. అరటిపట్టలరసమును నియ్యవచ్చును.

గన్నేరుకు, కరక్కాయల కషాయ మియ్య [illegible]

వెత్తిటీరకు, తుంగముస్తెలకషాయ మియ్యవల యును.

విషముష్టికి, నేరేడుచిగుళ్లు నూరి వేడినీళ్లలో కలిపి యియ్యఁదగినది. వెుంగలి ఊడల రసమును నీయవచ్చును.

తేనెకు, బొగ్గుల కషాయము నియ్యవలయును.

తమ్మలపాకులు నూరి మంచినూనెలో కలిపి త్రాగినవిషమునకు, టెంకాయపా లియ్యవలయును.

జీడి విషమునకు, గంగరావిపట్ట రసమునుగాని, చింతాకు పసరునుగాని, మంచినూనెలో చింత పండును కలిపిగాని, లోపలికిచ్చి; తాండ్రికాయ లను చింతాకును ఒకే తూనికగా నూరి శరీరమున పూసిన యెడల శమించును. మోదుగుపువ్వును నియ్యవచ్చును.

తీటకసింద సోఁకుడుచే కల్గిన దురదకు, బూడిద వేసి రాచి చల్లనినీళ్లతో కడుగ వలయును.

నేపాళమును తిని అధికముగా భేదియైన యెడల, ఎనుము పేడను నీళ్లలో కలిపి వడియగట్టి యిచ్చి నను, లేక తంగేడు చిగుళ్లు నూరి నీళ్లలో కలిపి యిచ్చినను, వసకాల్చి మసిచేసి దానిని [illegible]

పెట్టి యిచ్చినను; మజ్జిగ, లేక వేడినీళ్ల అన్నము పెట్టి నను, గుణమిచ్చును.

అభిని గంజాయి ఈ రెండును చేర్చి సేవించిన విష మునకు, నేతిని వేడినీళ్లలో కలిపి యియ్యవలయును.

కర్పూరము తిన్న మైకమునకు. గుంటగలగరాకు పసరియ్యవలయును.

[illegible] పాషాణ విషములకు [illegible], గంధకమును; నీలి, వంగ, నల్ల కాచి, ముదిరిన గలిజేరు, చిత్రమూల, [illegible] సమూలములును, శాంతిపఱుచును.

———:o:———